# ఎన్నో కప్పుల కమ్మని చిక్కని టీ కోసం



మా కుటుంబానికి,
ఎన్నో కప్పుల కమ్మని
చిక్కని టీ--రుబీకి
మా కృతజ్ఞతలు !




**లిప్టన్ రుబీ డస్ట్**

LRDC/CAS-1/78 TEL

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 - 1972]
శుక్రవారం : 23-2-'79
కాళయుక్తినామ సం. మాఘ బ. ఏకాదశి
సంపుటము 72 : సంచిక 24
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ:
'ఇంటింటి రామాయణం'లో
చంద్రమోహన్, జయసుధ




## ముఖ చిత్రం

2—2—79 పత్రికపై తాళ్లూరి రామేశ్వరి ముఖ చిత్రం చూచి సంతోషించాం. కాని సినిమా న్యూస్ లో ఆమె కంటికి గాయం తగిలిందని చదివి చాలా విచారించాం.

ఇక పోతే ఈ వారం ప్రచురించిన కథల్లో "మొదటి ఆట సినిమా" మాకు బాగా నచ్చింది.

డామెన్ గారి "లోకం పోకడ" కార్టూన్లు బాగున్నాయి.

పద్మ్రరు ఉదయకుమార్, అశోక్, కిషోర్, శ్రీను. సరోజ, కె. ప్రమీలా, డి. భవాని. (కుర్పాలోడ)

## శీర్షికలు

"ఈ మాదక ద్రవ్యం ఒక మొక్క ద్వారా లభిస్తుంది. దాన్ని వృక్ష శాస్త్రంలో 'కెన్నబిస్ ఇండికా' అంటారు." అని ప్రచురించినారు.

ఈ మొక్క పేరు కెన్నాబిస్ శటైవా అయి ఉండాలి.

ఈ ప్రజాతిలో ఒకే ఒక జాతి ఉన్నట్లు కనబడుతుంది. వృక్ష శాస్త్ర నామీకరణలో ఈ మార్పు ఎప్పుడు, ఎట్లా వచ్చినదో తెలియుట లేదు.

—డా. బి. యస్. యమ్. దత్, [ గుడివాడ. ]

* * *

"సంక్రాంతి శోభ" ముఖ చిత్రము చాలా బాగుగా ఉన్నది. "హాషిష్" దొంగ రవాణా అపూర్వంగా చేసిన యువ చతుష్టయం ఆట కట్టు! పూర్తి క్లుప్తంగా వివరించినందుకు మా ధన్యవాదాలు.

—పి. జగదీశ్వరరావు, ఇతరులు,
[ శ్రీశైలం ప్రాజెక్టు కాలనీ ]

## మనవి

ఉత్తరాలు రాసేవారు

* పూర్తిగా తెలుగు లిపిలోనే రాయాలనీ,
* వారి పేరు, పూర్తి చిరునామా కూడా రాయాలనీ,

మనవి చేసుకుంటున్నాము.

- సంపాదకుడు.

లోకం పోకడ – డామెన్












# కోటిగాడు

సీరియల్

కె. రామలక్ష్మి

(గత సంచిక తరువాయి)

**జరిగినకథ:** అగ్రహారం కరణం కూతురు మహాలక్ష్మి, వెట్టివాడి కొడుకు కోటిగాడు చిన్నతనంనుంచే కలిసి మెలిసి తిరుగుతూంటారు ఓనాడు మహాలక్ష్మి బలవంతం మీద ఆమెకు ఎంగిలి పెడుతున్న కోటిగాడిని చావబాదుతాడు కరణం. ఆయన బావమరిది కృష్ణుడు పంతులమ్మలను వేధిస్తూంటాడు.

బాగా పొద్దు పోయింది కచేరి సావిడి నుంచి కరణంగారు ఇంట్లోకి అడుగు పెట్టేసరికి, గోడనున్న పాత గడియారం పది గంటలు కొడుతూంది.. ఆయనగారికి గావంచా అందిస్తూ "ఇంత రాచకార్య మేమి టండీ మరీ పదిగంటల దాకానా? పిల్లొ తోడాను. త్వరగా రండి వడ్డిస్తాను" అంటూ భర్త బదులుకోసం ఎదురు చూడ కుండా వంటింట్లోకి వెళ్ళారు– కాస్త నెయ్యి వెచ్చ చేద్దామని.

మడిపంచె కట్టుకుని, భోజనానికి కూర్చున్నారు. "అమ్మడు అన్నం తిందా?" అడిగారు.

భర్త ముఖంలోకి చూడకుండానే, "తిందండీ! నిద్ర పోతోంది" అన్నారు ఆమె కంఠస్వరం విని వినబడనంత తగ్గు స్థాయిలో వుంది.

"ఏం... అలా వున్నావు?" కుతూహ లంగా అడిగారు భార్యని.

"ఏం లేదండీ! పాపం! మీరా కోటిగాడ్ని కొట్టడం చూసి జడుసుకుంది. అయినా గొడ్డును బాదినట్టు అలా బాత్తారా?"

"బాత్తానా...? చంపుతానా! వాడెవడు? మనం ఎవరం? ఒళ్ళు కొవ్వు కాకపోతే!" కోపంతో మండిపడ్డారు. మాట్లాడ కుండా వూరుకున్నారు సూరమ్మగారు యింకేనా అంటే, యింకేం ప్రమాదం ముంచుకొస్తుందోనని ఆవిడగారి భయం. "అదిగో పెరట్లో ఏదో అలికిడౌతోంది. ఆ వెధవ పొలం నుంచి వచ్చాడు కాబోలు వుండ మను" అన్నారు తినడం ఆపకుండానే. వంటిల్లు దాటి పెరట్లోకి వెడుతూ, "వెంకా కాసుకుందు; అయ్యగారొస్తు న్నారు" హెచ్చరించిపెట్టాక అమ్మగారి కంఠస్వరం వింటేనే– వెంకడికి కాస్త ఆనా మానం కలిగింది– ఏమైందా అని "అలాగే అమ్మగారూ. వీధరగు దగ్గర వుంటానమ్మా"

"వుండరా! కాస్త వచ్చాడి పెడతా, పట్టుకుపోదువుగాని" లోపలికి వెళిపోతూ అన్నారు సూరమ్మగారు.

"మాతల్లి! పెట్టుపోతలకి అన్నపూర్ణ మ్మతల్లే!" అనుకుని వీధికేసి నడిచాడు పొలం పనికి తొడుక్కున్న కిర్రు చెప్పులు చంకలో పెట్టుకుని, చాపాటి కర్ర మర్యా దగా కిందికి దించిపట్టుకుని, కరణంగారి రాకకోసం, వీధి అరుక్కి కాస్త దూరంగా నిలబడి ఆలోచనలో పడ్డాడు వెంకన్న. "ఏమైవుంటుందబ్బా? ఏండుకుండమ న్నారు? అన్నీ సరిగ్గానే చేశాం గదా! ఒక్క గడ్డిపరకూడా పోకుండా జాగ్రత్త చేశాం గదా..." అనుకుంటూ నేవున్నాడు—వెంకడు. "ఏరా" అంటూ కరణంగారు అరుగు మీదకి వచ్చారు, చేయి పై అంగవస్త్రంతో తుడుచుకుంటూ, త్రేపున తేన్చుకుంటూ. కళ్ళలో తెలియని భయాన్నీ కడుపులో తరగని ఆకలిని కట్టిపెట్టుకుని చేతులు జోడించి "అయ్యా" అన్నాడు వెంకన్న.

"ఏరా! నీ కొడుక్కి కన్ను తెలియడం లేదురా వెంకా! యిగోజెంచేశాడో తెలుసా?" అంటూ తెరిపిగా అరుగుమీద వాలు కుర్చీలో చేరబడ్డారు.

"బాబూ! వెధవండీ! మరీతెలివిమీరిపోతు న్నాడు. బాబూ! బుద్ధి చెప్పుకుంటాను..." చేతులు నలుపుకుంటూ చేసిన తప్పేమిటో తెలుసుకోకుండా ప్రాధేయపడ్డం మొదలు పెట్టాడు వెంకన్న.

"ఒరేయ్' ఏంచేశాడో వింటే నరికి పారేస్తావు!" తాపీగా తను ఇంత కటాక్షయుంగా ఆ దృశ్యం చూడ్డం జరిగిందో, ఎలా మందలించారో చెప్పారు కరణంగారు.

"వెధవ.. పిల్లది దడుసుకుంటుందని వూరుకున్నాను. పోరా! పో గట్టిగా గద మాయించు."

వెంకన్న కడుపు ఆకలితో మండుతూంటే యిప్పుడు విన్నదాంతో గుండెలు మండడం ప్రారంభించాయి.

"వెళ్ళు... మళ్ళీ కాస్త పెందరాడే తగ లడు – సూరా! వీడికేం యిస్తావో యిచ్చి పంపు" లోపలికి కేక వేశారు

వెంకడికి అమ్మగారు పెట్టేనాటి కోసం ఆగాలని కూడా లేదు. రెక్కలు కట్టుకెళ్ళి యింటి దగ్గర వాలాలనుంది. రెక్కలువిరిచి కట్టి, ఆ కోటిగాడికి బుద్ధి చెప్పాలనుంది. కానీ అక్కా తప్పదు. ఇచ్చేది పుచ్చుకోకుండా వెళ్ళిపోతే– గొడవ.

అమ్మగారు ఆకులో పెట్టి, ఆకు వెంకన్న పట్టిన పైతుండులోకి పడేశారు. "దండాలమ్మా" అంటూ వంచిన తలెత్త కుండా లోగిలి దాటి బయట పడ్డాడు. కరణంగారి యిల్లు దాటగానే వాడికాళ్ళకు కొత్త శక్తి వచ్చినట్టయింది. చెకచెక తమ కొంపలకేసి నడుస్తూంటే "ఏరా వెంకా! రెండు ముక్కలు కొత్తేంటిరా?" కల్లు పాకకి పోతున్న వీరాయి పిలిచాడు.

"ఒద్దురా! కొంపకి పోతున్నాను..." అప్పటికే జిహ్వాచాపల్యాన్ని చంపుకోలేని వెంకడి మనస్సు కల్లు పాకకా! ఇంటికా అంటూ ఏటూ తేల్చుకోలేకుండా వుంది. "రా మేస్... పెద్ద! ఏటైపోద్దని?" గడుసుగా పిలిచాడు వీరాయి. "పెద్దార చూస్తాడనా? వెంకా, అట్టా అట్టా

తిప్పటికి ఏరేం! మనం మనం ఒకటేకదరా! పద!" వెంకడి భుజం మీద చెయ్యేసి, దారి మళ్ళించాడు వీరాయి.

మండుతున్న మనస్సుమీద చల్లని జల్లు లాగా, ప్రాణం హాయనిపించింది వెంకడికి— రెండు గుక్కలు తాగేసరికి. అప్పటిదాకా లోపల్లోపల రగులుతున్న బాధ, కట్టు తెంచుకుని బయటపడ్డట్టయింది. "ఏటి బ్రతుకురా! వీరాయి! చూడి పూట..." అంటూ కరణంగారు చెప్పిన సంగతి చెప్పి బాధ వెళ్ళగక్కుకున్నాడు వెంకన్న.

వీరాయికి అంత మైకంలోనూ తక్షణం ప్రభుభక్తి జ్ఞాపకానికి వచ్చింది. "వాడా వెంకా! అనవాగ్గేయ్. నేను మా బాబు గారితో చెప్పి పొలం పనిలో పెట్టిస్తా" అన్నాడు. అదేమంత సులభమూ కాదు అయేది కాదని ఇద్దరికీ తెలుసు. కరణం గారి వెట్టివాడిని పనిలోంచి తీసేయించగా మునసబుగారు పనిలో పెట్టుకోరు!? అనవసరం గొడవ కొని తెచ్చుకున్నట్టు అవుతుందని లౌక్యంలో తలపండిపోయిన ఆయనకి బాగా తెలుసు. వీరాయి బాధవేరు. ఎలాగైనా వెంకన్నని తన వైపు తిప్పుకుంటే, యింకాస్త బలం ఎక్కువ అవుతుందని తనకి.

"ఏటో! తినా మానాలి? నానెలా బ్రతకాలిరా? ఎప్పటికప్పుడు బాకీ పెరిగిపోతూనే ఉందిగదా! కోటేశు కొడుకుట్నా, వాడూ బానా చాకిరీ చేసినా, యుగాలయ్యే మాట కాదు!" తాగిన తిమ్మిరి కాస్తా విషాదంలో కదుక్కుపోయినట్టయింది వెంకన్నకి.

"బొడ్లో రెండ్రూపాయలున్నాయి. దా మీద తాగరా వీరాయి." అంటూ మళ్ళీ రెండు కళ్ళు ముంతలందుకున్నాడు వెంకన్న.

అలా తాగి తాగి, యింటిదారి పట్టాడు, వెంకన్న. వాడి మనస్సు తెలియని ఏవేవో ఆలోచనలతో భగభగా మండి పోతూంది. "వెధవ! వెలివెధవ పల్లె, మాట పడాల్సి వచ్చిందన్న ఆలోచన క్షణక్షణానికి తలెత్తి బుస కొడుతోంది..." "ఎడికి ఒక్కసారి గట్టిగా బుద్ధి చెప్తేతప్ప—లాభం లేదు. ఎంతసేపూ పెద్దబుద్ధులూ, పెద్ద ఆలోచనలూ...ఎందుకొచ్చినవి?" కోపంతో మరిగిపోతున్న వెంకడి నడక వేగం హెచ్చింది. వాడలో అన్ని పాకల్లోనూ అక్కడక్కడ గుడ్డి దీపాలు వెలుగుతూనే ఉన్నాయి.

చీకటిని చీల్చుకుంటూ వస్తున్న వాటి వెల్తురు కూడా వెల వెల బారిపోతూ వెల్తురులాగే తోచడం లేదు.

వెంకన్న గుడిసె ముందు నిలబడి, "మాకాలూ! ఏడే ఆ వెధవ?" అంటూ తడిక తలుపు గట్టిగా నెట్టాడు. ఆ కేకకి ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది—కుక్కి మంచాన్ని ఆనుకుని కునుకు తీస్తున్న మాకాలు ఆ కేకకి కలత నిద్రలోకి ఒరిగిన కోటిగాడు కూడా కళ్ళు తెరచి చూశాడు, "బాబు కల్లు తాగొచ్చాడు—మనకెందు" అన్నట్టు మళ్ళీ కళ్ళు మూసుకు పడుకున్నాడు.

"ఏటే! గుడ్లప్పగించి చూస్తావు? ఏడి నీ కొడుకు? నా ముండాలా లేదా ఏడ్చుకుని!" అంటూ పాకలో మూలకి తగిల్చిన పిద్దలని అదిలించే కంచె కర్ర తీశాడు—ఆవేశంతో ఊగిపోతూ. మాకాలు క్షణంలో గ్రహించింది, కరణంగారు సంగతులన్నీ చెప్పే వుంటారని. అదరా బాదరాగా లేచి, నిలబడుతూ "ముందన్నంగా కాస్త తిను. రారా!" అంటూ అతగాడి దృష్టి తిండి మీదికి మళ్ళించాలని చూసింది. కానీ, అసలే కోతి అందులో కల్లు తాగింది. అన్నట్టుంది వెంకడి తీరు.

"తిండిట్ల తిండి! తన్నుతిట్లు పొలవనా! ముండ! నిన్ను నరకాలే ముందు. దానేంటని?



# కోటిగాడు

అమ్మాయిగారికి వింగి లెడతాడా?' అంటూ మంచం మీద పడుకున్న కొడుకేసి రెండంగలు వేశాడు అతని కంటే ముందుగ అడ్డంగా నిలబడడానికి పరుగెడుతూ, "ఆగ మావా, కొట్టికొట్టి అరిసేతులు వాచి లెట్టాయి నీకు కూడా వీందుకా కష్టం ఇంద ఒక్కసారి నరికి పారెయ్! వాడ్ని అందరూ రోజా రోజా కొంచెం కొంచెం వీందుకు చంపడం? ఒక్కసారి చంపెయ్ వాడి బాధ వీరగడై పోతుంది ఇందమావా! ఇంద నరికెయ్!" అంటూ చూర్లోంచి కొడవలి బైటికి లాగి వెంకన్న చేతిలో బలవంతంగా పెట్టింది నూకాలు.

"నరికేస్తానే — లేకపోతే — విదవ పాపికాపాడి కొడుకు! అమ్మాయిగారితో గాట్టాడమే చాలు, వింగిలెడతాడా?" అంటూ కొడుకు కన్పకున్న ఒంటిపొర పంచెగుడ్డ కాస్తా ఒక్క లాగు లాగి కింద పారేశాడు ముడుచుకు పోయిన కోటిగాడి మీదకెత్తిన వెంకడి చెయ్యి అలాగే ఉండి పోయింది కొడుకు ఒళ్ళంతా పులి చారల్లాగ వుండడం వాడి కంటపడింది అదృశ్యంతో వాడి విషి కాస్తా జీరోకి దిగి పోయింది

"ఏటే! చచ్చేలా కొట్టేశావా?" పెళ్ళాం కేసి వింతగా చూస్తూ నమ్మలేనట్టు అడిగాడు.

"అయ్యగారే అలా చావ బాదేశారు మావా! చంపేస్తారనుకన్నాను మావా! ఆరు చేసినదానికి తరువాయి యీ ఒంటి మీదింకెక్కడ కొడతావు? అందుకే చంపి పారేయమన్నా!" నంటూ కొడుకుని గుండెల కద్దుకుంటూ భోరున ఏడవడం ప్రారంభించింది నూకాలు

మంచం పక్కనే కుప్పలా కూలబడి పోయాడు వెంకన్న కూడా! "ఏటే ఈ దారుణం?" అడుగుతున్న వాడి గొంతుక పూడుకు పోయింది— దుఃఖంతో

"మావా! ఏటంది ఆడదానికి మళ్ళీ! నే చెప్తాలే అయ్యగారికి లే లే కూడు తిందువుగాని" కొడుక్కి తిరిగి బట్టకప్పి మొగుణ్ణి ఓదార్చడానికి ఉపక్రమించింది నూకాలు.

"నూకాలూ— ఏటే యీ దారుణం? వాడెందుకే యిలా అయిపోతున్నాడు?"

## గీతిక

ఈ గీతిక!
నా హృదయాంతరాంతరాలో
ప్రభవించిన జ్వలీయ సుప్రహాసిక
నా భావోన్నత శిఖరంలో
విదిగిన మధుర పదజాల ప్రహేళిక
నా విజ్ఞాన పరిధులో
విహరించిన జ్ఞానదీపికాకళిక
ఈ గీతిక!
ఈ గీతానికి శుభం పలికితే
నా మనసులో భయం నిండుకుంది
అందుకే
మాలపోగు న్యాయం జరగని
బడుగు బ్రతుకుల చరిత్రలో
ఊసరవెలి సంస్కారుల
ఉదాత్తమైన ఉగ్రరూపాలను
ఉజ్వలంగా రంగరించి,
సమసిపోయిన మహాత్ములకు
సకల ప్రణామాలర్పిస్తూ
జీవన వీణకు తంతిని సాగిపోతాను.

— పొట్లూరు లక్ష్మణరావు

"లోకం చూస్తున్నాడు కద మావా! వాడే నేర్చుకుంటాడు మొగుడి కళ్ళ జారడానికి సిద్ధంగా వున్న కన్నీళు తుడుస్తూ సముదాయించింది నూకాలు

"ఏటే నేర్చుకునేది? మనం ఏంటి. మన బ్రతుకేటి? మన బిడ్డ బిడ్డ కాదా? యీనాడికెలాగే, మనం అలా చెయ్యకూడదని చెప్పేది?"

"నే చెప్తాలే మావా! రేపటి నుంచి వాడు మారుతాడు పని పాటల్లోకి దింపి, వాడిని మారుస్తాను రా మావా కూడు తిను!" అంటూ బతిమలాడి మొగుణ్ణి లేవదీసింది నూకాలు. కోటిగాడి దొంగ నిద్ర కాస్తా నిజంగా నిద్రలోకి మారి పోయింది ఆ చీకట్లో చిరుదీపం వెల్గులో కష్టసుఖాలు కలబోసుకుంటూ కొడుకు నెలాగైనా కట్టుదిట్టం చేసి పాలేరు పనికి పనికొచ్చే దారిలోకి తిప్పాలని నిర్ణయించుకుని ఆ దంపతులు నిశ్చింతగా నిద్రకొరిగారు అప్పటికే తొలికోడి కూసింది.

2

"అమ్మాయిగారూ! బడిలో ఏం చెప్తారు?" అమ్మాయి గారికి తరడుగుల

దూరంలో భక్తిగా భుజాలు కుంచించుకు నడుస్తూ అడిగాడు కోటి కళ్ళకి కాటుక— బుగ్గన దిష్టి చుక్క కట్టిన పట్టుపరికిణీ ఆ ఉదయం ఎండలో మెరిసి పోతూంది ఒక్కసారి పక్కకి తిరిగి పక్కున నవ్వింది మహాలక్ష్మి—కోటిగాడి మాటకి "ఒరే పిచ్చి సన్నాసీ! బడిలో పాఠాలు చెప్తార్రా! మనకి తెలివి ఎక్కువవుతుంది అప్పుడు మనం—" మహాలక్ష్మి కింకా ఆ తెలివి తేటలు ఏం చేస్తామో, తెలియలేదు, జుట్టు రేక్కుండా మొనగోరుతో తల గోక్కుంటూ ఆ నవ్వని కాలి బాటమీద ఆగిపోయింది "అమ్మాయిగారూ! అలా తెలివుంటేనే గందా — బాబుగార్లాగా లిటిగేషన్లు చేయవచ్చు!" అనుమానంగానే అడిగాడు కోటిగాడు

లిటిగేషన్ మాట విందేగానీ, దానికి సరైన అర్థం తెలియదు మహాలక్ష్మికి "అన్నవమ్మాయి గారూ! పెదబాబుగారు, మీ మామయ్యగారూ అంటుండరూ—వాడి తల మారేసి, వీడితల పెట్టేసి... ." కోటిగాడు సరిగ్గా కృష్ణుడు మామయ్యను అనుకరించడం చూసి మహాలక్ష్మికి నవ్వాగలేదు కోటిగాడు కూడా నవ్వేశాడు ఆ నవ్వుల గొడవలో వాడి కర్రకొనవ తగిలి భుజాన వేసుకున్న మాలక్ష్మి పుస్తకాల సంచీ కింద పడింది పలకతోబాటు పడి తెరుచుకున్న పుస్తకం పేజీలలోంచి గాంధీ బొమ్మ నవ్వుతోంది ఆ పుస్తకం తీసి, అమ్మాయిగారూ! వీరెవరు? చదివినోరా? మహాలక్ష్మికి పాఠాల గొడవ అసలు నచ్చదు

"పో కోటీ! టీచరమ్మలాగే నువ్వూ, అస్తమానూ ప్రశ్నలు వేస్తావు పద" అంటూ బుంగమూతి పెట్టి గబగబా స్కూలుకేసి నడక సాగించింది మహాలక్ష్మి "అమ్మాయిగారూ! ఇంత కోపం దేనికండీ? యింకెప్పుడూ అడగనుగద" అంటూ వెను పరుగెట్టాడు

స్కూలుకి కాస్తంత దూరంలో పోయి "కోటీ! ఇటు చూడు" వింతగా స్కూలుకేసి చూపెట్టింది ఎప్పుడు లేనిది స్కూలు శుభ్రంగా తుడిచి వుంది. పాక కిటికీల దగ్గర నుంచి తెరిచి వున్నాయి "అరె! మరిచే పోయాము- కొత్త టీచరమ్మ యివాళ" బిక్క ముఖం వేసుకుని అంది మహాలక్ష్మి

"ఏం అమ్మాయిగారూ! కొడతారా?" బెంగగా అడిగాడు కోటిగాడు

"తెలియదు కోటీ! నేను యింకా చూళ్ళేదుగా- పద" అందేగాని మహాలక్ష్మి నడకలో జోరు తగ్గింది స్కూల్లో అప్పటి కింకా ఒక్క పిల్ల కూడా రాలేదు అంతా నిశ్శబ్దంగా వుంది కాస్త దూరంలో బాపాటి కర్ర కానుకుని పోలిగాడు నిలబడి వున్నాడు అమ్మాయిగారు వస్తుండడం చూసి కాస్త ముందుకు వచ్చాడు 'అమ్మాయిగోరూ! యీ పూట బడి లేదు కద విన్నవే చెప్పేశారు కద" అన్నాడు

"ఏం? ఎందుకు లేదు? కొత్త టీచరమ్మ వస్తుందటకద? రాలేదా?" ఆనందంగా అడిగింది కోటిగాడి మనస్సు వుసూరు మంది

"ఏం పోలిమామా? యిక్కడున్నావెందుకంట?" కోటిగాడు చనువుగా పోలిగాడి దగ్గరికి నడుస్తూ అడిగాడు

"పోరా కోటీ! నీ కెందుకంట? పోపో .. గొడ్లరుస్తున్నాయి నీ కోసం" ఓ తోపు తోశాడు కోటిని

"దండమ్మగోరూ!" అంటూ వెనుతిరిగాడు కోటి

"ఒరే ఓరే కోటీ! యీపూట నువ్వు మాంచి పిచ్చిగ్గూడు కట్టాలి దానికో గుడి గూడా కట్టాలేం చిన్న పందిరేద్దాం పువ్వులూ కొమ్మలూ అన్నీ తేవాలేం!" ఎక్కడలేని హుషారు వచ్చింది మహాలక్ష్మికి కోటిగాడి మనసుకి ఏదో శంక తోస్తూంది

"యీ పోలిమామ యిక్కడేం చేస్తున్నడబ్బా! ఎప్పుడూ చిన బాబుకి వంతపాడతూ పనీ పాటా అంతా తన బాబు నెత్తిన పడేస్తుంటాడు కదా!"

"అమ్మాయిగారూ! మామయ్య బాబుగారింట్లో వున్నారా?" అడిగాడు

కిలకిల నవ్వుతూ "కోటీ! పొద్దుటి నుంచీ మీసాలు నున్నగా తివ్వుతున్నాడు సంపెంగ నూనెరాసి అమ్మలేదూ కోప్పడింది కూడారా! ఏం? ఎందుకూ అడిగావు?"

"అబ్బ! ఒక్కచ్చెనం ఆగండమ్మాయిగారూ. !" చేతిలో సంచి కింద పారేసి స్కూలుపాక వెనకవైపు ఒక్క పరుగు తీశాడు. మహాలక్ష్మి నవ్వుకుంది కానీ వాడందుకు వెళ్ళలేదు

వెనకవైపు కిటికీ కింద నక్కి, నెమ్మదిగా తలపైకెత్తి లోపలికి చూడాలని వాడి తాపత్రయం వాడి ప్రయత్నం కంటే ముందు వాడి చెవిన మాటలు పడ్డంతో అది వినసాగాడు —"నువ్వు. నువ్వు యీ స్కూలికి టీచరుగా వస్తావని నేను కలలో కూడా వూహించలేదు ఇందిరా! నామాట నమ్ము నాకు . . ."

"నోర్మూయ్!" ఒక్క కసురు కసిరింది ఇందిర. కోటిగాడు ఆ గొంతు విని తల పైకెత్తాడు ఎంతో అందంగా వుందా పేరుగల వ్యక్తి తెల్లని దుస్తులతో మెళ్ళో సన్నని గొలుసుతో, నుదుట కుంకుమైనా లేకుండా, సాదాగా వుంది ఇందిర.



"నా మాట విను ఇందిరా! అనవసరంగా తప్పటెక్కాకు. ఇప్పటికే నీ జీవితం సగం బజారుపాల్తైంది. ఈ అగ్రహారంలో నా మాట కాదని నిన్ను కాపాడేవాడుంటాడను కోవడం కల్ల. నాతో యిదివరకు లాగే సఖ్యంగా ఉంటే— గుట్టు చప్పుడు కాకుండా ఆ ఉద్యోగం చేసుకోనిస్తాను... లేదా?" కాస్త రెండడుగులు దగ్గరగా నడిచాడు మాలక్ష్మి మామయ్య గోపాలకృష్ణ. కోటిగాడి పిడికిళ్ళు బిగుసుకు పోతున్నాయి. వాడికి ఒక్క వురుకున చినబాబుగారి మీదకురికి, నాలుగు బాదులు బాదాలని వుంది.

"ఒక్కడుగు ముందుకేస్తే చెంప పగుల్తుంది. జాగ్రత్త. నీలాంటి పిరికి వెధవని చూసి నేను భయపడి పారిపోను. నిలబడి పోరాడతాను. తెలుసుకో. ఇదివరకు నచ్చక పోతే వెళ్ళిపోయేదాన్నేమోగాని, యిప్పుడిక యిక్కణ్ణుంచి నన్ను కదపడం నీ తరం కాదు— నీలాంటి విషసర్పాలకి సమాధికట్టి గాని కదలను. తెలిసిందా కృష్ణా?— ఈ ఇందిర ఇదివరలోలా— ఉట్టి బేల కాదు. దగా చేయబడిన ఆడది. మోసగింపబడి బూ.గా. సమాజంలో ఎన్నో నిందలు మోసిన ఆడది... ఇదిగో చూడు— దీంట్లో మంగళ సూత్రం వుండదు. ఇదిగో ఇక్కడ కుంకుమ ఉండదు. ఎందుకో తెలుసా? నేను పెళ్ళి చేసుకోకుండానే— వితంతువు నయ్యాను. దాని అర్థం ఏమిటో తెలుసా? నువ్వు

# కోటిగాడు

బ్రతికి ఉండీ చచ్చినవాడితో సమానం అన్న మాట హూం... చచ్చినవాడు నన్నేం చేస్తాడు... దెయ్యం అయి బెదిరిస్తాడా? అలాంటి దెయ్యాలు నా దగ్గరకి రాకుండానే— నేను వితంతువు నయ్యాను" హేళనగా నవ్వింది ఇందిర. కృష్ణ ఇందిర చేయి అందుకోబోతూ— అబ్బ అంటూ నుదుటిపైనుంచి కారుతున్న రక్తాన్ని చూచి అదిరిపోయాడు.

జారిపోతున్న పాంటుజేబులోంచి,వుండేలు బద్ద తీసి ఓ చిక్కరాయివేసి, గురిచూచి వదిలాడు కోటిగాడు. అది సరిగ్గా తగిలిందా లేదా అని కూడా చూడ్డానికి ఆగకుండా మెరుపులా పారిపోతున్న కోటిగాడిని చూసింది మాలక్ష్మి. "కోటీ- ఒరే...కోటీ" అంటూ అడ్డదారిన పరుగెత్తడం మొదలుపెట్టింది. అలా వాడు ఎందుకు పారిపోతున్నాడో అర్థం కాలేదు మాలక్ష్మికి.

"ఇందిరా! నీ అంతు చూడకపోతే, నేను మీసాలు తీసేస్తాను. నువ్వేనా వుండాలిక్కడ, నేనేనవుండాలి" కసిగా అంటూ జేబులోంచి జేబు రుమాలుతీసి, తలకి ఒత్తుకుంటూ "ఒరే పాలిగా" అంటూ ఓ పొలికేకవేశాడు. "అయ్యా! పిలిచారా బాబు!" అంటూ చేతులు జోడించి నిలబడ్డాడు. అపరదుర్గలాగా నిలబడిన కొత్తటీచరమ్మని, నెత్తికి గుడ్డ నొక్కిపట్టి కోపంతో వణికిపోతున్న తన యజమానిని చూచి అయోమయంలో పడ్డాడు పాలిగాడు. "వెధవ నాయాలా! ఎవర్రా ఆ వచ్చింది?" కోపంతో మాట కూడా తడబడుతోంది. "మన బుడ్డమ్మ గారండి! బడిపున్నారనుకొని వచ్చారు. ఏం పంచేశానయ్యా!" భయంగా బదులుచెప్పాడు పాలిగాడు.

"కాదురా! ఆ కోటి వెధవ వచ్చుంటాడు- నేను వాడి రక్తం కళ్ళ చూస్తా" ఇవతలికి నడిచాడు కృష్ణ.

"లేదు బాబయ్యా! అమ్మాయిగారు కూడా వాడు కనబడలేదని అడ్డంపడి వెళ్ళిపోయారండి!"

"లేదురా! ఇది వాడి పనే అయుండాలి. నన్నుకొట్టే మొనగాడా?" రక్తం అంటిన రుమాలు చూసుకుంటూ పళ్ళు కొరికాడు కృష్ణ.

పాక వసారాలో స్తంభానికి ఆనుకుని, సన్నగా నవ్వుతూ "కృష్ణా! నువ్వు పేరు మార్చుకో. ఆపద్బాంధవుడగా, అనాథ రక్షకుడగా, మానినీ మాన సంరక్షకుడగా అయిన కృష్ణ భగవానుని పేరుకి మచ్చ తేకు ... మరచిపోకు — ఎక్కడ కంసమామలున్నా, అక్కడో బుల్లి కృష్ణుడుంటాడు" అనేసి విసురుగా లోపలికి వెళ్ళిపోయింది ఇందిర.

తన గదిలో కూలబడిందన్న మాటేగాని బుద్ధి అదే వింత ఆటకి ఆశ్చర్యం వేసింది — ఇందిరకి. ఎక్కడ చదువుకునే ఇందిర. ఎక్కడ ఈ- అన్నీ విసర్జించి — పసివాళ్ళకి పాఠాలూ, పాటలతోపాటు మంచి బుద్ధులూ నూరిపోస్తూ కాలక్షేపం చేయాలను కుంటున్న ఇందిర ?

జిల్లా విద్యాధికారి మాట గురించి చెప్పినప్పుడు కాస్త కూడా వూహించలేదు ఇందిర. "ఏ టీచరు ఒక్కనెల్లాళ్ళపాటు వుండడంలేదమ్మా! ఆ వూరు పెత్తందారీ పెద్దలుండ నివ్వడంలేదంటారు కొందరు. ఏవేవో వంకలు పెట్టి, తప్పించుకు ట్రాన్స్‌ఫర్లు తెచ్చుకుంటున్నారు కొందరు. ఏ టీచరూ పట్టుమని పదిరోజులు వుండక పోతే ఇంకా వూళ్ళో పిల్లలకి చదువు ఎలా వస్తుందమ్మా! పట్టుబడి ఎంత లేదన్నా పదిమైళ్ళదూరం. ఏదో సామెత చెప్పినట్లు అవుతుంది యింటిపక్కనే స్కూలు పెట్టి,



23-2-1979 శుక్రవారం మొదలు

1-3-1979 గురువారం వరకు

# వారఫలం

మేషం : వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. వారం ఆఖరులో ఆకస్మికంగా చికాకులకు గురికాగలరు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

వృషభం : అనుకూలమైన వార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. స్త్రీలకు — వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

మిథునం : చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

కర్కాటకం : మీ ఆలోచనలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో వ్యతిరేక పరిస్థితి యేర్పడుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం పెరుగుతుంది.

సింహం : రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ఉద్యోగంలో గౌరవ లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు.

కన్య : వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

తుల : మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. అవసరమైన సందేహాలు కలుగుతాయి. స్త్రీలకు— దైవకార్యాలు నెరవేరతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

వృశ్చికం : సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఏ వ్యవహారంలోను మొగమాటాలు తగవు. ముమ్ముందు లాభించ గల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు — సంతోషకరమైన వార్తలను వింటారు. విలాస వస్తువులు కొంటారు.

ధనుస్సు : భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

మకరం : వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

కుంభం : మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

మీనం : వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో చికాకుల యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. విలాసవస్తువులు కొంటారు.

— మహేష్

పిల్లల్ని పంపండి మహాప్రభో అంటుంటే దిక్కులేదు- ఇక అంతదూరాలు పంపిస్తారా? ఇప్పటికి ఎంతమందికి అర్డర్లు వెయ్యడం, మార్చడం అయిందో...

ఇందిర నవ్వేస్తూ, "అంత శ్రమ పడాల్సిన చోట ఛాలెంజి వుంటుంది సార్! నేను వెడతాను. ఫరవాలేదు" అని భరోసా యిచ్చి ఆర్డర్ అందుకుంది. కానీ- ఆ ఆర్డరు అందుకునేప్పుడు ఎదుర్కోవలసి వస్తుందన్న ఛాలెంజి యిదికాదు- విస్పష్టంగా అనుకుంది ఇందిర.

"ఎవరో తనని కాపాడాలని రాయివిసిరిన కుర్రాడు" అనుకుంది. "ఎవరైతేనేం? సమయానికి తగినపని చేశాడు... ఈవూళ్లో వున్న బెడద పెత్తందార్లు కాదు. ఈ కృష్ణ అన్నమాట.." అనుకుంటుంటే ఇందిర పెదవులమీద చిరునవ్వు వెల్గింది "పిచ్చి కృష్ణా! అమాయకంగా విన్నునమ్మి మోసపోయి, ప్రాణం తీసుకుందామనుకున్న అబలకాదీ ఇందిరిప్పుడు. చచ్చి బ్రతికి, క్రొత్త ధైర్యం తెచ్చుకున్న మొండిజీవి. వితంతువువని చెప్పుకుంటూ, అం భర్త చాటున, మాంగల్యం చాటున సంఘపు చీడ పురుగులనుంచి, రక్షణకోసం దాక్కుంటున్నాను. కృష్ణా! మంచికో చెడుకో దీని అంతం చూస్తాను... నువ్వీ అగ్రహారానికి పట్టిన చీడవే అయితే, అది వదిలిస్తాను. నేను పారిపోను. నిన్నూ పారిపోనివ్వను" అనుకుంది. ఈ నిర్ణయం తీసుకోవడంతో ఎంతో ధైర్యం వచ్చినట్టయింది ఇందిరకి. పిల్లలు స్కూలుకి రాకపోవడానికి కారణం ఇప్పుడు బాగా అర్థమయిన ఇందిర, జోళ్లు వేసుకుంటూ లేచింది "ఈ అగ్రహారపు పిల్లలేకాదు, యీవూరి హరిజనవాడ పిల్లలు కూడా యీ బడికి వచ్చేలా చేస్తాను" అని ఎన్నో స్థైర్యంతో పాక తలుపులు వేసి వూళ్లోకి బయలుదేరింది ఇందిర

(ఇంకా వుంది)




శంకర్రావు, భోజనం చేస్తూ, యేదో ఆలోచిస్తూ వుండటాన్ని, వడ్డిస్తోన్న శారద, గమనించింది. ఎప్పుడూ లేనిది, ఆయన ఆరోజు యెందుకంత పరధ్యానంగా వున్నారో, ఆమెకి అంతుచిక్కలేదు. భర్త, చాలా సెన్సిటివ్ వ్యక్తని ఆమెకి బాగా తెలుసు. అయితే, యెప్పుడేం జరిగినా, తనతో పూస గుచ్చినట్టు చెప్పేవ్యక్తి, ఆరోజు యేవీ చెప్పకుండా, లోలోపలే మథనపడుతున్నారని సందేహించింది.

"ఈరోజు, మీరేదో పరధ్యానంగా వున్నారండీ! ఏంజరిగిందేవిటి?" వుండబట్టలేక, ప్రశ్నించింది, శారద.

శంకర్రావు, చప్పున సమాధానం చెప్పలేదు. అతని మొహంలో కాస్తంత రంగు మారింది. ఏంచెప్పాలో, యెలా చెప్పాలో, యిదమిత్థం తేల్చుకోలేక పోయాడు. ఇంక అన్నం తినబుద్ధిగాక పోవడంతో, చెయ్యి కడుక్కున్నాడు

శారద విస్తుపోయింది. ఆమె హృదయం కలుక్కుమంది.

"తినకుండా లేచిపోతున్నారేవిటండీ?" అంది, ఆరాటంతో.

"తినాలనిపించడంలేదు శారదా!" అంటూ లేచి వెళ్ళిపోయాడు.

శారదకి, ఆరాటం అధికమయ్యింది. భర్త అంతగా కలవరపడ్డం, పరధ్యానంగా వుండటం, ఆమె యెప్పుడూ చూళ్ళేదు. దీనికేదో బలీయమైన కారణం వుండి వుంటుందనే నిర్ణయానికొచ్చి, కంగారు పడింది. భోజనం చెయ్యాలని కూడా గాని, ఆమెకి తినబుద్ధిగాలేదు. ఏదో యెంగిలి పడ్డాననిపించుకుని లేచింది. వంటగది చక్కబెట్టుకుని, భర్త గదిలోకి వెళ్ళింది.

శంకర్రావు, వాలు కుర్చీలో చేరబడి, తీవ్రంగా యోచిస్తున్నాడు. అతని మొహం బాగా వాడిపోయి వుంది. కళ్ళల్లో, ఏదో బెదురు స్పష్టంగా అగుపిస్తోంది. శారద, భర్తకి అభిముఖంగా వున్న బల్లమీద కూలబడింది.

"ఇవ్వాళ మీరెందుకో అదోలా వున్నారండీ! ఇంతకీ ఏం జరిగింది? విషయం యేవిటో చెప్పకుండా మీ మనస్సులోనే బాధంతా దాచేసుకుని కుమిలిపోవడం యెందుకు చెప్పండి? మీ బాధను పంచుకునే అవకాశాన్ని నాకూ యివ్వండి" అంది శారద మెల్లగా.

భార్య ఆరాటాన్ని అవగాహన చేసుకున్నాడు శంకర్రావు. నిజమే! తనలోన్ని బాధతో లోలో కుమిలిపోయే కంటె విషయాన్ని ఆమెతో చెప్పి, హృదయ భారాన్ని కొంతయినా తగ్గించుకోవడం మంచిదేమోనని పించిందతనికి. ఆవేదనా పూరితంగా ఓ నిట్టూర్పు వదిలాడు

"ఎలా చెప్పడమో నాకు తోచడంలేదు శారదా!" అతని గొంతు బొంగురుపోయింది. వస్తోన్న దుఃఖాన్ని ఆపుకోడానికి ప్రయత్నిస్తున్నట్టు యిట్టే గ్రహించవచ్చు.

శారద మరింత తల్లడిల్లిపోయింది, భర్త గొంతులోని మార్పు చూసి. ఆమెకి యేడుపొచ్చినట్టయ్యింది "ఇంతకీ జరిగిందేవిటో చెప్పండీ? నాకేవిటో భయంగా వుంది" అంది రుద్ధ స్వరంతో

"ఈరోజు నా జీవితానికి గ్రహణం పట్టిన రోజు శారదా" యింకా చెప్పలేక పోతున్నట్టుగా ఆగిపోయాడు.

"ఆగిపోయారేం? ఏమయ్యిందో చెప్పండీ" సుమారు యేడుస్తూనే అంది శారద.

"లంచం తీసుకోవడం అపరాధమని అందరికీ తెలిసిన విషయమే! అలాగని అవకాశాలుండి, ధైర్యం గల వాళ్ళెవరూ లంచాలు తీసుకోవడం మానలేదు. ఈ

# మీరు మీ శ్రీవారితో/ శ్రీమతితో
# కాశ్మీరు విహారయాత్ర చేయాలనుకుంటే...

నేడే మా...

**మీకో స్వంత గ్రంథాలయ పథకం** లో

వెంటనే సభ్యులుగా చేరండి!

• మొదటి బహుమతి

వారం రోజులపాటు మా ఖర్చులపై

భూలోక స్వర్గమైన **కాశ్మీర్ విహారయాత్ర.**

• రెండవ బహుమతి

**10** రోజులపాటు **ఊటీ** మరియు

**నీలగిరి హిల్స్**లో ఉల్లాసంగా

విహరించండి!

• మూడవ బహుమతి

**20** కన్సోలేషన్ బహుమతులుగా **అత్యంత**

ఆధునికమైన ప్రియదర్శిని షోల్డర్ వ్యానిటీ బ్యాగ్!

5,000 మంది సభ్యత్వం పూర్తి కాగానే మీ సభ్యత్వ నంబర్లపై బహుమతులు గాను తీయబడును పై బహుమతులు మీరు పొందాలనుకుంటే మీరు చేయవలసినది వెంటనే పై పథకంలో చేరి.. మీ అదృష్టాన్ని పరీక్షించుకోండి. ఈ అవకాశం కనీసం **6** నెలలు సభ్యత్వం పూర్తి చేసిన వారికే. ప్రవేశ రుసుము కేవలం రూ. **4/-** మాత్రమే. దీనికిగాను మీకు సాహిత్యాచార్య K V. నాగేశ్వరరావు గారు రచించిన 'సూక్తి ముక్తావళి' వెంటనే పంపబడును ప్రతినెలా రూ **10/-** చందా కట్టండి సుప్రసిద్ధ రచయిత/ రచయిత్రుల నవలలు ఒక్కొక్కటి రూ **3-50** ల విలువ గల మూడు నవలలతో బాటు ప్రతి నెలా ఒక బోనస్ బుక్ ఉచితంగా పొందండి అంటే రూ **14/-** విలువ గల 4 నవలలు కేవలం రూ **10** లకే మీకు లభిస్తాయి **150** పేజీలు గల నవల మీకు కేవలం రూ **2-50/** లకే లభిస్తోంది. మీరు కట్టే సంవత్సర-చందా రూ **120+4** సభ్యత్వ రుసుము మొత్తం రూ **124** లకు మీకు **49** నవలలు వస్తాయి. సంవత్సర చందా ఒకేసారి చెల్లిస్తే రూ **114** లు మాత్రమే. అంతేగాక మా సభ్యులైన వారికే మా డిస్ట్రిబ్యూషన్ కేటలాగ్ లోని ఏ నవలైనా **20%** తగ్గించి ఇవ్వబడును. అంతేగాక మా సంస్థ కేటలాగ్ కూడా ఉచితంగా పంపించబడుతుంది. మేము ప్రచురించే నవలలు ఏ దిన, వార, పక్ష, మాస పత్రికలలో కూడా ప్రచురించబడనివి మాత్రమే వుండును. మీ సభ్యత్వ రుసుము రూ **4/-** పంపి ఈ క్రింది నవలల్లో మీకిష్టమైనవి ఎన్నుకోండి ఎటువంటి పోస్టేజి ఖర్చు లేకుండా మా ఖర్చులపై మీకు వి.పి.పి ద్వారా పంపిస్తాము.

• 'సూక్తి ముక్తావళి' కె. వి. నాగేశ్వరరావు [సభ్యత్వమునకు ఉచితంగా ఇచ్చే నవల]
• 'అమృత మథనం' డా॥ కొర్రపాటి గంగాధరరావు
• 'పాంచజన్యం' డా॥ సి. ఆనందారామం
• 'ఒక జంట కలసిన తరుణాన' మురుమళ్ళ విజయలక్ష్మి
• 'శరద్రాత్రులు' ముదిమాణిక్యం నరసింహారావు
• 'ఇది ఉదయం' కళాప్రపూర్ణ లత
• 'మిస్ మధుమతి' గోవిందరాజు సీతాదేవి
• 'పథ విహీనులు ఎవరు?' డా॥ కె వి కృష్ణకుమారి
• 'త్రికోణ దృశ్యాలు' ఇందిరా నారాయణ
• 'కాలక్షేపం' భమిడిపాటి కామేశ్వరరావు
• 'మనో మందిరం' ప్రమీలా జనార్ధన్
• 'సారికలు' శ్రీధర
• 'ఆషాఢ గౌతమి' ముదిగొండ శివప్రసాద్
• 'షికారి' ఎస్ ఝాన్సీరాణి

వెంటనే చేరండి! అన్ని ప్రాంతములనుండి ఏజెంట్లు, డిస్ట్రిబ్యూటర్లు కావలెను. ఏజెంట్లకు ఆకర్షణీయమైన కమీషన్ ఇవ్వబడును.



## లత ఎంటర్‌ప్రైజెస్

బుక్ పబ్లిషర్స్ అండ్ డిస్ట్రిబ్యూటర్స్

మెయిన్ రోడ్, రాజమండ్రి బ్రాంచి హైదరాబాద్

# నీతిలేనికథ

విషయంలో నేను మొన్న మొన్నటి దాకా నిక్కచ్చిగా వున్నా, తోటి వుద్యోగుల ప్రోత్సాహంతో యిటీవల అందరిలా నేనూ లంచాలు తీసుకోవడం ఆరంభించాను. ఈ రోజు నా పాపం పండినట్టుగా, మా ఆఫీసరు నేను లంచం తీసుకుంటూ వుండగా చూశాడు" అంటూ ఆగాడు, శంకర్రావు నిట్టూర్పు విడిచి.

"ఎంతపని జరిగిందండీ? మన దురదృష్టం గాకపోతే ఈరోజే అతని దృష్టిలో పడాలా?" అంది శారద రుద్ధస్వరంతో.

"చెప్పానుకదా శారదా? ఈ రోజు నా జీవితాన్ని అధఃపాతాళానికి తొక్కిపెట్టిన చెడురోజు. చూసి, అతను వూరుకున్నాడంటావా? అబ్బే! లేదు ... నేరుగా నా దగ్గరికొచ్చి, లంచ మిచ్చిన వ్యక్తిని దిడా పెడా చీవాట్లు పెట్టి, అతణ్ణి వెళగొట్టి, అతను అందజేసిన యాభై రూపాయలూ నా జేబులోంచి తీసి, నావేపు చురచురా చూసి, తన గదిలోకి వెళ్ళిపోయాడు. నిజం చెప్పాలంటే, ఆ క్షణం లోనే నా గుండెలు ఆగిపోయి నట్టాయి, నీరుగట్టిపోయాను. నలుగురి యెదుట జరిగిన యీ అవమానానికి, నాకు తల కొట్టేసినంత పనయింది అక్కడితో కథ అంతమైతే ఫరవాలేదు. ముందు ముందేం జరుగనున్నదో, ఆ భగవంతుడికే తెలియాలి రేపటికి నా వుద్యోగం వుంటుందో, వూడుతుందో చెప్పలేం. నా పరధ్యానానికి, నా ఆలోచనలకి కారణం యేమిటో యిప్పుడు నీ కర్థమై వుంటుంది" అంటూ నిస్పృహతో చెప్పుకు పోయాడు శంకర్రావు.

శారద కళ్ళు, అప్రయత్నంగా అశ్రుపూరితాలయ్యాయి పరిస్థితి అర్థమై, యేం జరుగనున్నదో వూహించుకునేసరికి, భవిష్యత్తు అంధకార బంధురంగా అగుపించింది. లంచం తీసుకోవడం నేరమని తెలిసి కూడా, భర్త అటువంటి ప్రలోభానికి యెందుకు లోనయ్యాడో అనుకుంది. అయితే ఆ ప్రశ్న వెయ్యడం, ఆయన్ని మరింత సంక్షోభ పర్చడమే జరుగుతుందనిపించి, చీర చెరగుతో కన్నీరు ఒత్తుకుంది.

"మనమేం పాపం చేశామని మనకిలాంటి వుపద్రవం తెచ్చిపెట్టాడండీ భగవంతుడు? ఏదో ఓ మార్గం చూడండీ! మీ ఆఫీసర్ని బతిమాలుకోండి ... మళ్ళీ యెప్పుడూ యిటువంటి నీచపు పని చెయ్యనని లెంపలేసుకోండి. ఆయన మనసు కరిగి క్షమిస్తాడేమో!" అంది.

"ఆయన కొత్తగా వచ్చాడు. సూటిగా పోయే వ్యక్తని ప్రతీతి. అందుకే యే ప్రయత్నం చెయ్యడానికి భయంగా వుంది. ఇంకెవరైనా అయితే బతిమలాడో, లేక లెంపలేసుకునో, అదీ కాదంటే డబ్బుకి కరిగే మనిషయితే లంచమిచ్చో, యీ యిక్కట్టు నుండి తప్పించుకునేవాణ్ణి. కాని, యీయన వినిపించుకోడట..." దిగాలుగా అన్నాడు శంకర్రావు.

శారద మాత్రం యింకా [illegible] చూడండీ! దేవుడిమీద భారం వెయ్యండి. ఈ పరిస్థితిలో అంతకంటె మనం చెయ్యగలిగిందేమీ లేదు. ఆ వేంకటేశ్వరస్వామే మనల్ని కాపాడుతాడు. ఈ ప్రమాదం తప్పిందంటే, తిరుమల కెళ్ళి ఆ స్వామి దర్శనం చేసుకుందాం..." అంటూ భగవంతుడిమీద భారం వేసింది శారద.

"అలాగే ప్రయత్నిస్తాను. ఆపైన మన అదృష్టం..." అంటూ లేచి మంచం మీద ఒరిగాడు శంకర్రావు.

ఆరోజు రాత్రి శంకర్రావు దంపతులకు కంటినిండా నిద్ర పట్టలేదంటే అతిశయోక్తి వుండదు.

* * *

మరుసటిరోజు ఉదయం—

పదిగంటలు దాటి పదినిముషాలయ్యింది. శంకర్రావు తన సీటులో కూచున్నాడేగాని, ముళ్ళకంపమీద కూచున్నట్టే వుందతనికి. తనింక ఆసీట్లో వుంటాడా? అసలు, ఆ ఆఫీసులో వుంటాడా? వుద్యోగం వుంటుందా? వూడుతుందా? తనిప్పుడేం చెయ్యాలి? ఆఫీసరు కాళ్ళమీద పడితే..? యిలా అతని ఆలోచనలు సాగిపోతున్నయ్. ఏ నిర్ణయానికీ రాలేని అస్థిమిత స్థితిలో వున్నాడు.

"బాబూ, అయ్యగారు పిలుస్తున్నారండీ" బంట్రోతు వచ్చి చెప్పాడు.

ఉలిక్కి పడ్డాడు శంకర్రావు. అతనికి హృదయ స్పందన అధికమయ్యింది. హఠాత్తుగా మొహం స్వేదంతో నిండిపోయింది. జేబులోంచి రుమాలు తీసి, మొహాన్ని ఓసారి ఒత్తుకున్నాడు లేస్తుంటే కాళ్ళు వణికాయి. సరి! అయిపోయింది. ఈ రోజుతో తనకీ యీ ఆఫీసుకి ఋణం తీరిపోతుంది. ఏముంది? తానువెళ్ళిన వెంటనే తన చేతిలో డిస్మిసల్ లెటర్ పెట్టి పొమ్మంటాడు ఆఫీసర్ తప్పకుండా.. అనుకుంటుంటే, అతనికి యేడుపొచ్చింది. ఛీ! ఛీ! తనెందుకీ అప్రాచ్యపు పనికి పూనుకోవాలి? తనకేం లోటని? ఇప్పుడెందుకీ నరక యాతన మానసికంగా అనుభవించాలి? నలుగురూ తనకేసి యెలా చూస్తున్నారని? అంతా ఖర్మ! అనుభవించక తప్పదు. అనుకుంటూ మెల్లగా ఆఫీసరు గదిలోకి






# శివుని అష్టతనువులు

త్రిమూర్తులు సమాన ప్రభావశక్తులు కలవారైనా ఎవరిపని వచ్చినప్పుడు వారికే ప్రాధాన్యం ఉంటుంది అందువల్ల సృష్టి చేసేటప్పుడు బ్రహ్మకే ప్రాధాన్యం వుంటుంది కల్పాదియందు అతనిశరీరంనుండి ఒక బాలుడు ఉద్భవించాడు. పుట్టీ పుట్టగానే యితరశిశువులవలెనే ఆ బాలుడున్నూ ఏడ్వసాగాడు "ఎందుకు ఏడుస్తావు?' అని బ్రహ్మ ప్రశ్నించగా ఆ శిశువూ- తనకు పేరు పెట్టవలెనని అన్నాడు రోదనం చేయడం వల్ల ఆ బాలునికి విధాతరుద్రుడని పేరు పెట్టాడు. అలా పేరు పెట్టి, ఏడవకధైర్యంగా వుండమన్నాడు కూడా కానీ ఆ శిశువు మళ్ళీ ఏడుసార్లు ఏడ్చాడు. అప్పుడు బ్రహ్మ క్షణకాలం ఆలోచించి, ఆ బాలుడికి రుద్రుడు అనే పేరుతోపాటు మరి ఏడు పేర్లు పెట్టాడు ఆ పేర్లు ఇవి భవుడు శర్వుడు - ఈశానుడు- పశుపతి- భీముడు- ఉగ్రుడు - మహాదేవుడున్నూ

ఈ విధంగా ఆ బాలుడికి ఎనిమిదిపేర్లు పెట్టడమే కాకుండా ఆ పేర్లకుతగిన స్థానాలను కూడా ప్రజాపతి ఏర్పరచాడు

ఒకే వ్యక్తికి యిన్నిస్థానాలు ఏర్పరచడం ఏమిటి? అనే ఆలోచన విరించికి కలిగిందో యేమో? ఎలాగూ ఎనిమిది పేర్లు పెట్టాము గదా! ఎనిమిది తనువులు ఏర్పరిస్తే బాగుంటుందని నిశ్చయించి, ఆ ఎనిమిది స్థానాలనూ రుద్రుని ఎనిమిది తనువులుగా తీర్చిదిద్దాడు అందువల్లనే మహేశ్వరునికి అష్టమూర్తి అనేపేరు ప్రసిద్ధమయింది

ఎనిమిది శరీరాలు ఉండడంవల్ల ఈశానునికి ఎనిమిది స్థానాల్లోనూ ప్రవేశం కలిగింది

ఆ ఎనిమిది తనువులు సూర్యచంద్రులు, పంచభూతములు, యజ్ఞం చేసే యజమానుడున్నూ

రుద్రునియొక్క శరీరం సూర్యుడు ఇది రుద్రుని తీక్ష్ణత్వాన్ని తెలియజేస్తుంది. భవుని శరీరం జలం. శర్వుని శరీరం భూమి. ఈశానుని శరీరం అగ్ని. పశుపతి శరీరం వాయువు భీముని శరీరం ఆకాశం. ఉగ్రుని శరీరం సోమయాజి మహాదేవుని శరీరం చంద్రుడు.

దీనివల్ల ఒక విశిష్టమైన అంతరార్థాన్ని గ్రహించవచ్చును నిర్గుణమైన పరమాత్మ ఒక్కటే అయినా, అది సగుణమైనప్పుడు సత్వరజస్తమో గుణాలను గ్రహించి బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగా మారుతుంది. శివునికిఅష్టశరీరాలు ఉన్నవని చెప్పడంవల్ల అతడు పంచభూతాల్లోనూ, సూర్య చంద్రులలోనూ వ్యాపించి ఉన్నాడని అర్థమవుతుంది. "సర్వం విష్ణుమయం జగత్" అన్నట్టుగానే "సర్వం శివమయం జగత్" అనిన్నీ భావించవచ్చును యజమానుడు ఒక శరీరం అని చెప్పడంవల్ల మన ప్రాచీనులు యాగానికి ఇచ్చిన ప్రాధాన్యం స్పష్టమవుతూ ఉన్నది.

---

ప్రింగ్‌డోర్స్ తోసుకుని వెళ్ళాడు తన సహోద్యోగులు చెవులు కొరుక్కుంటూ వుండటం కూడా గమనించాడు కూడా కాని యేంచెయ్యగలడు? దొరికిన దొంగ తనే! వాళ్ళంతా దొరకని దొంగలు ...

"గుడ్‌మార్నింగ్ సార్" సవినయంగా అన్నాడు శంకర్రావు అతని కంఠస్వరం కంపించింది

"గుడ్‌మార్నింగ్ కూచో" గంభీరంగా అన్నాడు ఆఫీసరు అతని మొహం కందగడ్డలా వుండటంతో, ఆ మొహంలో మాటిగా చూళ్ళేకపోయాడు శంకర్రావు కూచోడానికి భీతిల్లి నుంచునే వున్నాడు.

"ఫరవాలేదు సార్" అన్నాడు

"నీ సర్వీసు యెన్నాళ్ళయ్యింది?"

"పదిహేనేళ్ళు సార్"

"ఎన్నాళ్ళనించి నువ్విలా లంచాలు పుచ్చుకోడం సాగిస్తున్నావు?"

శంకర్రావు తడబడ్డాడు. వున్నది వున్నట్టుగానే చెప్పేసి, బ్రతిమలాడ్డం మంచిదనుకున్నాడు

"ఇది మూడోసారి! సార్ మొదట్లో లంచాలు తీసుకోవడమంటే, వ్యతిరేకించేవాణ్ణే కాని, సహవాసదోషం నన్నిలా మార్చింది వాళ్ళు బలవంతంచేసి యిస్తున్నారు సార్ :ఏంచెయ్యను? ప్రలోభపడ్డాను తప్పయ్యింది సార్ ఈ ఒక్కసారికి నన్ను క్షమించండి సార్ మళ్ళీ యెప్పుడూ యిలా గడ్డికరవను తమకి హామీ యిస్తున్నాను" అంటూ ఒక్క గుక్కలో యేకరువు పెట్టాడు శంకర్రావు ప్రాధేయపూర్వకంగా.

అంతా విని ఆఫీసరు నవ్వేడు. ఆ నవ్వులో సౌమ్యత లేదు అందుకే శంకర్రావు కంగారుపడిపోయాడు. ఇంత ప్రాధేయపడినా అతని మనస్సు కరగలేకపోయినందుకు బాధపడ్డాడు

'అయితే నీకు వాళ్ళు బలవంతంగా యిస్తున్నారంటావు?" అన్నాడు ఆఫీసరు

'ఔను సార్! వాళ్ళ కాంట్రాక్టు బిల్సు కాస్త తొందరగా పంపమని ఒకటే పాట పాడుతూ, బలవంతంగా జేబులో పడేస్తారు డబ్బు ఏం చెయ్యను?"

"ఇచ్చేవాళ్ళు బాగా డబ్బున్నవాళ్ళేనా?"

"వున్నవాళ్ళే సార్! లేకపోతే కాంట్రాక్టు ఎలా తీసుకుంటారు చెప్పండి? వేలకి వేలు సంపాదిస్తున్నారు..."

"వాళ్ళూ అన్యాయాలు చేసి అక్రమంగా సంపాదిస్తున్నారంటావు?"

"సార్...' చెప్పడానికి సంకోచించి అదోలా చూశాడు శంకర్రావు

# నీతిలేనికథ

"చెప్పవోయ్ భయంలేదు" అభయ మిచ్చాడు ఆఫీసరు

"లేకపోతే మాకు డబ్బెందుకిస్తారు సార్?"

"అయితే ఫరవాలేదు కాని పేదవాళ్ళ దగ్గర కక్కుర్తి పడకు పార్టీని చూసి మరీ ప్రవర్తించు" అని చెప్పిన ఆఫీసరుకేసి, వింతగా చూశాడు శంకర్రావు. తన చెవుల్ని తనే నమ్మలేక పోయాడు

"సార్... మీరు చెబుతున్నది..." అర్ధోక్తిలో ఆపేశాడు

"ఇందులో అబద్ధం లేదోయ్.. నిజమే చెబుతున్నాను ఒక్క విషయం ఆలోచించు డబ్బు సంపాదించాలనుకున్నవాడు, నిజాయితీగా ఎప్పుడూ సంపాదించలేడు ఏ కొద్ది మందో తప్పించి. డబ్బుగడించిన ప్రతివ్యక్తీ యేదో విధమైన అన్యాయంచేసే గడిస్తున్నాడన్నది నిర్వివాదాంశం! ఈ విశాల విశ్వంలో మనమనగా యెంత? అయితే హద్దు మీర కూడదు ఇదిగో– నిన్నను నీ జేబులోంచి తీసిన యాభై రూపాయలు. ఇందులో ఫిఫ్టీ పర్సెంటు నా భాగంగా తీసుకున్నాను మిగిలిన ఫిఫ్టీ పర్సెంటు నీది··· తీసుకో!" అంటూ పాతిక రూపాయలు అందించాడు శంకర్రావుకి, ఆఫీసరు.

శంకర్రావు నివ్వెరపోయాడు. ఇదో కొత్త వింతలా తోచినది. అయితేనేం– తానూహించిన ప్రమాదం తప్పినందుకు మనసు కుదుటబడింది. అతనిలో ఆ క్షణం వరకూ దోబూచులాడుతూ వుండేభయం పటాపంచలయ్యింది

అంత గంభీరమైన ఆఫీసరులో అటువంటి మార్పు తెచ్చినందుకు, భగవంతునికి కృతజ్ఞతతెలుపుకున్నాడు మనసులో ఆ డబ్బు తీసుకుని జేబులో వేసుకున్నాడు

"చాలా థాంక్స్ సార్! మీ మేలు యెప్పటికీ మర్చిపోను "అన్నాడు కృతజ్ఞతా భావంతో

"దీని అంతరార్థం తెలిసిందా ?"

"ఎస్సార్" నవ్వుతూనే సమాధాన మిచ్చాడు.

"ఓ కే! ఇకవెళ్ళు."

మందహాసంతో, బోర విరుచుకుంటూ బైటికొచ్చాడు. శంకర్రావు

"ఏమన్నాగేవిటి ?" సహోద్యోగులు ఆసక్తితో అడిగారు చుట్టూమూగి

"ఏమంటారుమర్యాదగా చివాట్లు పెట్టి, 'తప్పనాయనా' అన్నారు అంతే."

"అంతేనా ?" ఆశ్చర్యంగా అడిగారు వాళ్లంతా శంకరావుని యేదోవిధంగా శిక్షిస్తారనుకున్న వాళ్ళకి నిరాశే కలిగింది

"అంతేమరి !" నిజం చెప్పడం యిష్టం లేకపోయింది శంకర్రావుకి

శంకర్రావుహుషారుగా తనసీట్లోకూచుని పని ప్రారంభించాడు.

* * *

సాయంకాలం ఆరింటికి ఇల్లు చేరుకున్నాడు శంకర్రావు భర్త రాకకోసం యెదురుచూస్తున్న శారద, భర్త హుషారుగా వున్నందుకు, లోలోన మురిసిపోయింది. "మీ ఆఫీసరు యేమన్నాడండీ? కనికరించి క్షమించాడా ?" అంది లోపలికి వస్తూ

"వాడి మొహం! వాడు కనికరించేదేవిటి? వాడూ డబ్బుకి కక్కుర్తిపడే రకమే!"

"అంటే..." భర్త మాటల్లోని భావం యేవిటో అర్థంగాక అడిగింది

"నేను సంపాదించిన దాంట్లో సగం వాడికివ్వాలి అదీ ఒప్పందం" శారద తెల్లబోయింది

"అంటే అతనూ లంచం తీసుకుంటాడన్నమాట..." కళ్ళింతవి చేసుకుంటూ అడిగింది.

శంకర్రావు నిండుగా నవ్వేడు

"అన్నమాటేవిటి? వున్నమాటే! బైట పడనంతవరకూ అందరూ నీతిమంతులేశారదా! లోతుకిపోతే, ప్రతి వ్యక్తి కథా ఓ అవినీతి కథలా వుంటుందేమో! అవన్నీ యిదిగో సంపెంగలు... ఆ పొట్లంలో హల్వా, పకోడీలు వున్నయ్.. నాకు స్ట్రాంగు కాఫీ యివ్వు.." అంటూ రెండు పొట్లాలు అందించాడు, శంకర్రావు

శారదకి నోట మాట రాలేదు. నీతి, నిజాయితీ యెక్కడున్నయ్? వీటికి అర్థం యేవిటి?... అనుకుంటూ లోపలికి నడిచింది.

శంకర్రావు నవ్వుకుంటూ, జేబులోంచి డబ్బుతీసి, బీరువాలో పెట్టేశాడు

# మీ పసిపాపను గమనించండి








# సిరిలాక్®

## తో కలుగుతుంది

ఇది పాపకు పుష్టికరమైన
సంపూర్ణ ధాన్యపు పిండి ఆహారం.

పాలు, పంచదార...ప్రేమతో
పరిపూర్ణమైనది.




దీనిని తయారుచేయడం చాల తేలిక-దీనితో నీరు చేర్చండి -అంతే



ముందుగా
మరగబెట్టిన నీటితో
సిరిలాక్ చేర్చండి



బాగా కదపండి.



వెంటనే
యిచ్చేందుకు
తయారు

మీ పాపకు 3 నెలలు వచ్చేశాయా? అయితే మీ పాప నిండుగా పెరుగుటకు యిప్పుడు చక్కని సమపాళ్ళ దిట్టమైన ఆహారం చాలా అవసరమైవుంది.

సిరిలాక్ పాపలకు పుష్టికరమైన సంపూర్ణ ధాన్యపు పిండి ఆహారం ఇది యెంతో రుచికరమైనది ధాన్యపు పిండి, పూర్తి మీగడపాలు, పంచదారతో తయారైనది మీ పాప పెరుగుదలకు అతి ముఖ్యముగా అవసరమైన పుష్టిని పూర్తిగా యిస్తుంది ఇందులో

- మీపాప ఆరోగ్యంగా వుండుటకు కావలసిన క్రొవ్వు పదార్థములు, కార్బోహైడ్రేట్లు సరియైన సమపాళ్ళలో వున్నవి
- మీపాప అనుదినం పెరుగుటకు తగినంత ప్రోటీనులు వున్నవి
- మీపాప తేజముగ వుండుటకు అదనపు విటమినులు మరియు యినప శక్తి వున్నవి

-NESTLE

SAA/FSL/G/1043/TEL



## చెప్పులతో కాపీ!

మణిపాల్‌లోని మణిపాల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీకి చెందిన మాథియాస్ అనే విద్యార్థి పరీక్ష రాస్తూ రాస్తూ అస్తమానూ తన చెప్పుల కేసే చూసుకుంటున్నాడట. ఇదేమిటని అతని చెప్పులు చూస్తే వాటి మీద అక్షరాలున్నాయట. ఈ విషయం కోర్టు విచారించి అతడు పరీక్ష వ్రాయొచ్చునీ, ఎటొచ్చీ అతని పరీక్షా ఫలితాలను మాత్రం ఆపవచ్చని అన్నదట.

## సూర్యరష్మితో నడిచే కారు

స్వీడనులో ఒకాయన సూర్యరశ్మితో పరిగెత్తే కారును కనిపెట్టాడట. ఆ కారుకు ఎనిమిది కారు బ్యాటరీలు, 502 సోలార్ సెల్స్ అమర్చారట. ఇంధనమేమీ లేకుండానే యిది పరిగెత్తడం వల్ల పొగకాని, శబ్దంకానీ చెయ్యదట. ప్రస్తుతం యిది గంటకు 50 కిలో మీటర్ల వేగం వరకూ పోతుందిటగానీ, మొత్తం 50 కిలో మీటర్ల దూరంకన్నా ఎక్కువ పోదట. ఈ విషయానికి సంబంధించిన పరిశోధనలు జరుపుతున్నారట.

### మనిషికి ఆరు ఎలుకలు!

భారతదేశంలో ఉన్న ప్రతి మనిషికి ఆస్తి పాస్తులున్నా లేకపోయినా, దేశంలో ఉన్న ఎలుకలను లెక్కగడితే ప్రతి మనిషికి ఆరు ఎలుకలు వాటా వస్తుందనీ, దేశంలో ఎలుకల సంఖ్య అంత ఎక్కువున్నదనీ ప్రభుత్వ లెక్కలు తేల్చాయట. ఈ ఎలుకలు ఏటా వెయ్యికోట్ల రూపాయలు విలువచేసే ఆహారధాన్యాలను స్వాహా చేస్తున్నాయట. ఈ ఎలుకలనెలా అదుపులో పెట్టాలో అని ప్రభుత్వం విచారిస్తున్నది. వేయేం! ఆహార పరిశోధనా నిలయాలు అసలీ ఎలుకలను మనిషి ఫలహారంగా తిన వీలుందా అని పరిశోధిస్తే పోలా! ఆహార సమస్యా తీరుతుంది, ఆహార నష్ట సమస్యా తీరుతుంది. వన్నాట్.... లెక్క.

### పైలట్ల కొరత?

ఎయిరిండియాలో విమానం నడపడం నేర్చుకుని, ఆ సంస్థ ద్వారా విదేశాలలో కూడా శిక్షణ పొంది, విమాన చోదకులుగా నో మూణ్ణాళ్ళు పనిచేసి ఆనక ఆ విమాన చోదకులు విదేశ సంస్థలలో చేరిపోతున్నారట. దీనిక్కారణం వారికా విదేశ సంస్థలు ఎక్కువ జీతాలు, భత్యాలు, సౌకర్యాలూ యివ్వడమేనట. అయితేభారద్దేశం ట్రయినింగు శ్రమపడ్డా పైలట్ల కొరత తీరటం లేదుట! కాదు మరి!

### ప్రపంచలో పొడుగైన రైలు!

ప్రపంచంలోకల్లా అతి పొడుగైన రైలు 29న తేదీన తమిళనాడు మద్రాసు స్టేషను వదలి ఢిల్లీకి బయలుదేరిందట. ఈ రైలులో వెయ్యి పడకలున్నాయట. అంతేగాక ఒక ఫైవ్ స్టార్ హోటలు కూడా ఉన్నదట. ఈ రైలు 30 గంటలలో 2188 కిలో మీటర్ల దూరాన్ని చేరుకుంటుందట. ఈ ట్రైనుకు రెండు డీజలింజనులున్నాయట. మనదేశం ఈ రంగంలో బాగా ముందంజవేసింది.

### తొమ్మిదేళ్ళ బాలికపై అత్యాచారం!

వేంపల్లె గ్రామంలో నో యువకుడు మరి కొందరు స్నేహితులతో కలసి నో పథకం వేసి, తన పినతల్లి కూతురు తొమ్మిదేళ్ల అమ్మాయికి నో తోటలో పని ఇప్పిస్తామని చెప్పి నమ్మించి తీసుకుపోయి ఆ తోటలో ఆమెను బలాత్కరించి అందరూ అనుభవించి, ఈ విషయం చెప్తే చంపుతాం పో అని బెదిరించి పంపేశారట. మహాకవి సుబ్రహ్మణ్య భారతి ఏమన్నాలో తెలుసా ....వంటరిగా ఏనాడయితే ఒక స్త్రీ నిర్భయంగా తిరగగలుగుతుందో ఆనాడే దేశానికి నాగరికత అబ్బినట్టు లెక్క అన్నారు— కానీ యీనాడో మగాడయినా వంటరిగా రాత్రుళ్ళు పట్టణంలో అయినా తిరగ్గలడా.... నో భారతీ.... ఈ దేశానికి నాగరికత ఎప్పుడో...

### వజ్రాల స్మగ్లింగ్!

వెస్ట్ జర్మనీ దేశీయుడు జాన్ అనే చోటు నుంచి పాస్‌పోర్టు గా వగైరాలతో మన దేశానికి వచ్చి బొంబాయిలో స్మగ్లింగ్ వ్యాపారం చేస్తూ పట్టుబడ్డాడట. ఆ మహానీయుని వద్ద ఒక మిలియను రూపాయలు ఖరీదు చేసే వజ్రాలున్నాయట! అవేమయ్యాయో ఆనక!

### రైల్వేల అభివృద్ధి

1950—1951వ సంవత్సరంలో రైల్వే సంస్థ మీద పెట్టుబడి 727 కోట్లనీ, అది 1976—77 నాటికి 4534 కోట్లు అయ్యిందనీ, రైళ్ళ ద్వారా 73 మిలియను టన్నుల ఆహార ధాన్యాల, తదితర రవాణా ఉండేదనీ, అదీవాడు 212 మిలియను టన్నులుగా అభివృద్ధి చెందినదనీ ఆ శాఖ వారన్నారట.

### రోడ్డు ప్రమాదాలు

బెంగళూరులో సర్వే ఆఫ్ ఇండియాలో పనిచేస్తున్న ఉత్తప్ప అనే ఆయన తన స్కూటరు మీద ఇంటికి పోతుండగా జైనగర ప్రాంతంలో నో లారీ ఎదురొచ్చిందట. అనుకోని విధంగా అయిన ప్రమాదంలో ఆయన స్కూటరు లారీని ఢీకొన్నదట. ఆయన చనిపోయారట. పెన్యా ప్రాంతంలో నో సైకిలు వ్యక్తిని తప్పించుకోడానికి చిత్రదుర్గ నుంచి బెంగళూరు వస్తున్న నో బస్సు చేసిన విఫల ప్రయత్నంలో ఆ సైకిలు వ్యక్తి బస్సు క్రింద పడడమే గాక, బస్సు వెళ్లి చెట్టుకు గుద్దుకొని ముప్పయిమంది గాయపడ్డారట. సైకిలు వ్యక్తి చనిపోయాడట.

( గత సంచిక తరువాయి )

























[ఇంకా వుంది]

# జీవిత  మాధుర్యం

సీరియల్ — యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

## 6

ఆ మరునాడు నలుగురు మనుష్యులు గొడ్డళ్ళు పట్టుకుని వచ్చేరు. వినోద్, భూషణం దగ్గరుండి తోటలోనున్న పెద్ద, పెద్ద చెట్లను ఓ పదింటిని కొట్టించేరు. తోటలోని ఫలవృక్షాలు ఏనాడో ఎండి మోడై గాలివానలకు విరిగి నేలపాలయ్యేయి ఇప్పడున్నవి సగం ఎండివున్న పెద్ద చెట్లు అవి కలపకుతప్ప మరి దేనికి పనికిరావు. ఆ మరునాడు లక్ష్మివారం. వినోదమూర్తి టౌనులోకి వెళ్ళి ఆ కొట్టివేయబడ్డ చెట్లు ఆదివారంనాడు విక్రయించబడును అన్న కరపత్రాలను కొట్టించి ఆ ఊరులోనున్న కలప వర్తకులకు పంపేడు తరువాత మోటారు సైకిలుమీద ఏలూరు వెళ్ళి నరసింహులు అనే ఆసామిని కలిసేడు

నరసింహులకి ఓ వృత్తి అన్నది లేదు అతడికి అన్ని వృత్తులు తెలుసు. అసలు అతడు వడ్రంగి. పేకింగు పెట్టెలను చవగ్గా కొని క్రరసామాన్లు చేసి బజారులో పెట్టి అమ్మేవాడు దక్షిణాది నుండి బనీన్లు, జంగీలు చవగ్గా కొని తెచ్చి ఏలూరులో నాలుగురోడ్ల కూడలిలో పెట్టి, అవి జపాను నుండి వచ్చినవని అతిరహస్యంగా కాకినాడరేవులో స్మగుల్డ్ చేసి తెచ్చినవని చెప్పి అమ్మేవాడు ఆ ఊరులోనేకాక దగ్గరలోనున్న ఏ ఊరుకైన వేలంపాటలకు వెళ్ళి తన వంతు కమీషను క్రింద సిండికేటులో చేరి పదో పరకో రాబట్టుకుని వచ్చేవాడు. కాకినాడరేవుకి మచిలీపట్నంరేవుకి వెళ్ళి జపాను వాచీలను దొంగతనంగా కొనితెచ్చి పట్టణాలలో అమ్మేవాడు. కొన్నాళ్ళక్రితం వినోదమూర్తి ఏలూరులో ఓ హోటల్లో బసచేసినప్పుడు నరసింహులు ఓ 'సీకో' వాచిని అమ్మజూపేడు. అప్పుడు అతడితో పరిచయమైంది

''చూడు నరసింహులూ! చెట్టుకు కనీసం నూరురూపాయలు రావాలి. ఇప్పుడు బజారులో ఏ చెత్త కలపైనా ఘనపుటడుగు పాతికరూపాయ లుంది. ఒక్కొక్క చెట్టు కనీసం పాతిక ఘనపుటడుగుల కలపనిస్తుంది బండి ఖర్చు, కోత ఖర్చు పోను నూరురూపాయలకు కొన్నవాళ్ళకు మరింత లాభముంటుంది. అందుచేత నేను నిర్ణయించింది సబబైన రేటే. వాళ్ళ పాట నూరురూపాయలకు తగ్గిందా, నువ్వు నూరు వరకు పాడు. పాట అంతకు పైబడితే నువ్వు ఊరుకోవచ్చు ఇంద ఈ పదిరూపాయలు బస్సు ఖర్చుకు వుంచుకో. వేలంపాట అయింతరువాత

## ( గత సంచిక తరువాయి )

నీకు ఏభైరూపాయలిస్తాను. సరేనా ?''

''అదేమిటి బాబూ మీ మాట కాదనగలనా ?''

శుక్రవారంనాడు భూషణం ఆ చెట్టు మొదళ్ళను రెండడుగుల వరకు త్రవ్వించి తీయించేసేడు. ఆ త్రవ్వించి తీసిన ముక్కలను సన్నగా చీరించేడు అట్లాగే పడగొట్టిన చెట్ల తాలూకు సన్నని కొమ్మలను కొట్టించేడు ఆ కర్రలను వంటపొయ్యికి వాడడానికి పెరట్లోని పాలలో పెట్టించేడు

ఆదివారం పగలు పదిగంటలకు ఆ తోటంతా కోలాహలంగా వుంది ఓ పదిమంది చెట్లను కొనడానికి వచ్చేరు. మరో ఇరవైమంది వేలాన్ని చూడడానికి వచ్చేరు. వేలంపాట సాగుతూంది. చెట్టుకు ఏభైరూపాయల చొప్పున ఊరులోని వర్తకులు పాడి, పాటను ఆపేసేరు. వెంటనే నరసింహులు ముందుకు వచ్చి మొత్తం ఆ పది చెట్లకు తొమ్మిదివందలన్నాడు. నరసింహులు హుందాగానే తయారై వచ్చేడు. తెల్లని పంచె, తెల్లని లాల్చీ, పైమీద జరీ కండువా వేసుకున్నాడు వేలంపాటలకు వెళ్ళేటప్పడే నరసింహులు అలా ముస్తాబై వెళ్తాడు. నరసింహులుకు చదువు రాకపోయినా తెలివితేటలు బహుమెండు. బ్రతకడం ఎలాగో బాగా తెల్సు. అలాగని ఎవ్వరినీ చెయ్యిచాచి ఎరుగడు. ఏదో వ్యాపారం, ఏదో వృత్తి చేస్తాడు. ఎవ్వరైనా తనని విశ్వసించి ఏదైనా పని అప్పగించితే చాలా నమ్మకంగా చేస్తాడు, ఎట్టి మోసం చెయ్యడు. అందువల్ల నరసింహుల్ని చాలామంది నాడుకుంటారు. ఎలాగో నాల్గుడబ్బులు కిట్టుబాటయిన ఏ పనేనా చేస్తాడు.

ఉన్న ఊరులో తప్ప ఏ ఊరులోనైనా వేలంపాట వుందంటే తప్పక వెళ్తాడు. తనవంతు కమీషను పదోపరకో రాబట్టుకుని వస్తాడు. ఇప్పుడీ విధంగా నరసింహులు పనికివచ్చేడు

నరసింహులు పాట పెంచగానే ఊరులోని వర్తకులకు కోపం వచ్చింది. వెంటనే ఓ వర్తకుడు, ''నువ్వెవడివయ్యా — మా పాటమీద పాట పాడుతున్నావు? మీదే ఊరు?'' అని నరసింహుల్ని ప్రశ్నించేడు.

''నాది ఈ ఊరు కాదులెండి. నేనో వడ్రంగినిలెండి. పైగా నాకో కలపఅడితీ వుంది. ఈ కలప మంచిదండీ. ఆ మూడు నల్లమద్ది ముక్కలే చాలాచేస్తాయి. ఇంతకీ నాకు లాభసాటిగా తోచిందనే నేను పాడేను కావలిస్తే మీరూ పాడుకోండి.''

''సరేలేవయ్యా పాడు! ఈ వూరు నుంచి ఈ దుక్కల్ని ఎలా మీ వూరుకు తీసుకునివెళ్తావో మేము చూస్తాం,'' అని బెదిరించేరు.

''అదేం కష్టంలేదండి. మా బావమరిది లారీ డ్రయివరులెండి వాడే లారీ పై ఊరు నుంచి తీసుకునివచ్చి ఎత్తుకుపోతాడులెండి. నా పాట తొమ్మిదివందలు — అంతే.''

''వెయ్యి.'' స్థానిక వర్తకుని పాట.

''ఒక వెయ్యి — ఏభై,'' నరసింహులు పాట.

''ఒక వెయ్యి — నూరు,'' మరో వర్తకుని పాట.

వినోద్ సౌంజ్ఞ చేస్తున్నా వినకుండా నరసింహులు పాడేస్తున్నాడు.

''ఒక వెయ్యి రెండొందలు.''

మొదటి కలప వర్తకుడు మరింత కోపగించి— ''ఒక వెయ్యి మూడొందలు,'' అన్నాడు. నరసింహులు ఆశ్చర్యాన్ని నటించి చెట్లన్నిట్నీ మరోసారి చూసి, జేబు లొకసారి తడుముకొని వికాకుగా —

''ఈ వూరివారంతా కుమ్మక్కయితే, పై వూరివాడ్ని నేనేం పాడగలను. సరే మీరే ఎత్తుకోండి — మీరే లాభాలు కొట్టేయండి,'' అని విసురుగా వెళ్ళిపోయేడు వూరులోకి.

స్థానిక కలపవర్తకులు దిగ్విజయంగా నవ్వుకున్నారు. వినోదమూర్తి చేతికి పదమూడు వందల రూపాయలిచ్చి తరువాత బండ్లపై చెట్ల మోడులను తీసుకునిపోతామని డబ్బుకు రసీదు తీసుకుని వెళ్ళిపోయేరు వారు వెళ్ళిన పావుగంటకు దర్జాగా నరసింహులు వచ్చేడు నవ్వుతూ.

వినోద్ అతడ్ని చూసి నవ్వుతూ ''నరసింహులూ! కొంపతీసి వాళ్ళు పాట ఆపేస్తారేమోనని భయపడ్డానయ్యా.''

''అదికాదు బాబూ—వాళ్ళ ధోరణి చూసేను.

**జరిగిన కథ - 4 :** బ్రతికి చెడ్డ భూషణం కుటుంబం చేసుకోబోయిన ఆత్మహత్యా ప్రయత్నం వినోదమూర్తి రాకవల్ల విఫలమవుతుంది. వాళ్లను ఆదుకొనటానికి తోటను కౌలుకు తీసుకొని కొన్నాళ్ళు అక్కడే వుండాలనుకుంటాడు వినోదమూర్తి. లోగడ ఆస్తిలో తన వాటా తీసుకొని దుర్వ్యసనాలకు లోనై, సినీతార తిలోత్తమ వ్యామోహంలో పడతాడు భూషణం తమ్ముడు చక్రవర్తి. ఆస్తి అంతా హరించగా భార్య నిరాదరణతో కృశించి మరణిస్తాడు. వ్యాపారంలో కలిసిరాక భూషణం అప్పులపాలవుతాడు.

వాళ్ళు ఎక్కువగానే పాడేటట్లున్నారు అందుకే నేను పాటను పెంచేసేను మీరు వద్దంటున్నా మీరు కోపగిస్తారని కాని లేకుంటే పాటను పదిహేనువందల వరకు పెంచేద్దును ''

''అత్యాశకూడదు – మొదటికే మోసం రావచ్చు నువ్వు చేసిన సహాయానికి చాలా థాంక్సు ఇదిగ ఈ ఏభై రూపాయలు వుంచు,'' అని వినోద్ ఓ ఐదు పదిరూపాయల నోట్లను అందించేడు

''నరసింహులూ! నీ అవసరం ముందెప్పుడైనా నాకు కలగవచ్చు.''

''అదేంటి సార్! ఈ నరసింహులు మీవాడనుకోండి కాకిచేత కబురంపినా వస్తాను మీకు సహాయం చెయ్యడమే నా అదృష్టం మరి వెళ్తా బాబూ,'' అని నరసింహులు శలవుతీసుకుని వెళ్ళిపోయేడు

భూషణంకు, సుకుమార్‌కి యిదంతా అయోమయంగా తోచింది అందరూ వెళ్ళిపోయేక ఇంట్లోకి వచ్చిన తరువాత తను చేసిన పని, నరసింహులెవరో వినోద్ చెప్పగానే అందరూ ఆశ్చర్యపోయేరు

''బాబూ! నువ్వు చాలా గడుసువాడివే ఈ వూరు వ్యాపారులకు బాగా బుద్ధిచెప్పేవు,'' భూషణం మెచ్చుకున్నాడు

''మా వినోద్ చాలా తెలివైనవాడు,'' విశాలాక్షి మెచ్చుకుంది

లావణ్య మెచ్చుకుంటుందేమోనని ఆమెవైపు వినోద్ చూసేడు అంతవరకు కుతూహలంగా వినోద్‌ను చూస్తున్న లావణ్య చూపును మరల్చివేసింది

''భూషణంగారూ! మీలా తిన్నగా పోయేవాళ్ళకు సరైనరోజులుకావండి వ్యాపారంలో కాస్త మెలకువగా ఉండకపోతే మోసం జరిగిపోతుంది మనం తిన్నగాపోయుంటే ఇవాళ వీళ్ళు మన చేతిలో ఎనిమిదివందలుపెట్టి మనకింకా రావల్సిన అయిదువందలూ ఇవ్వకపోయుందురు. ఇదే ప్రపంచరీతి ఇదండి ఈ పన్నెండువందలఏభై మీ వద్ద వుంచండి – ఇవి మీవే ''

భూషణం, అతడితోపాటు అందరు ఆశ్చర్యపోయేరు

''అదేమిటి బాబూ! ఆ డబ్బంతా నాకిచ్చేస్తున్నావు మరి కూరగాయల ఫారమ్‌కు నారు, ఎరువులు కొనాలికదా – చుట్టూ కంచె వేయించాలికదా డబ్బు ఎంతో అవుసరముంటుందే, నీదగ్గరే వుంచు '' అని భూషణం అనగానే వినోద్ నవ్వేసేడు

''భూషణంగారూ! మీరు మన కంట్రాక్టు మరచిపోతున్నారు నేనేమన్నాను – తోట మీది, ప్రయోగం నాది అన్నాను ఆ ప్రకారంగా తోటను మీరు నాకిచ్చేరు అంతవరకే మీ సంబంధం మిగతా గొడవంతా నాది నేను పక్కా వ్యాపారస్తుణ్ని లాభం చూడకుండా నేను ఏ వ్యాపారంలోకి దిగనుకదా ఈ చెట్లు మీవి. వాటిమీద వచ్చిన డబ్బు మీది మీ అవుసరానికి దేనికైనా పనికొస్తుంది వుంచండి,'' అనిభూషణంగారి చేతిలో బలవంతంగా ఆ డబ్బంతా వుంచేసేడు

''అమ్మా! చాలా ఆకలిగావుంది ఈ డబ్బు గొడవలోపడి నేను మీకు చెప్పడమే మరచిపోయేను– వడ్డించరూ,'' చిన్నపిల్లాడిలా విశాలాక్షిని అడిగేడు

అందరు నవ్వుకున్నారు భూషణం మాట్లాడకుండా లేచి, మనస్సులో వాత్సల్యం పొంగుతుంటే, వినోద్‌ని అమాంతం కౌగిలించుకుని మెల్లగా ఆ డబ్బును బీరువాలో పెట్టుకుందుకు తన గదిలోకి పోయేడు వినోద్ చాలా జాలిగా భూషణంగారి వైపు చూస్తుండిపోయేడు విశాలాక్షి భూషణం చర్యను సరిగా అర్థంచేసుకుని కళ్ళు చెమర్చగా ఒత్తుకుని –

''అవును బాబూ! నీ సంగతే నేను సరిగా చూడడంలేదు మీ అమ్మగారైతే యిలా అశ్రద్ధ చేసేవారా? అవును ఒంటిగంట కావస్తుంది, ఇప్పుడే వడ్డిస్తాను రేపటి నుంచి ప్రొద్దున్న ఫలహారం చేసిపెడతా బాబూ,'' అని ప్రేమగా అంది

లావణ్య, వనజ త్వరగా కదిలి కంచాల్ని, గ్లాసుల్ని తెచ్చిపెట్టేరు పదినిముషాలలో వడ్డన పూర్తయింది

భూషణం అప్పుడు చాలా ఉత్సాహంతో, అన్నిరోజుల తరువాత ఆసక్తితో భోజనంచేయ నారంభించేడు ఆశ్చర్యకరమైన విషయమేమంటే వినోద్ సమక్షంలో ఆ ఇంటిల్లిపాది ఏ చింతలూ లేకుండా ధైర్యంగా, ఉత్సాహంగా వుండగల్గుతున్నారు వినోదమూర్తి మాటల్లోను, ఆ చిరునవ్వులోను అంతటి మహత్తరశక్తి వుంది

భోజనాలయేక వినోద్ భూషణంగారితో కూరగాయల ఫారం గురించి తన పథకాన్ని చెప్పేడు

''భూషణంగారూ! ఈ ఇంట్లో ఓ నమ్మకమైన పనివాడు కావాలి ఏమైనా చిల్లరమల్లర పనులు ఇంటా బయటా చేయడానికి కావాలి సైకిలు తొక్కడం వస్తే మరీమంచిది అన్నిటికన్న ముఖ్యం ఇక్కడ వ్యవహారాలు బయటకు చెప్పకూడదు మంచి నిజాయితీపరుడు అయ్యుండాలి వయస్సు సుమారు నలభైయ్యుంటే



సరిపోతుంది ఈ వూరులోని వ్యక్తులు, ఇక్కడ పరిసరాలు బాగా తెల్సినవాడైతే మంచిది మీదగ్గర ఇంతకుముందు నమ్మకంగా పనిచేసి వాడెవడైనా వుంటే పిలిపిస్తారా ?''

భూషణం కాస్సేపు ఆలోచించి — ''రామయ్య అనే వాడుండేవాడు వాడిప్పుడు లక్ష్మి బియ్యం మిల్లులో ఏదో చిన్న పని చేస్తున్నాడు నేను కబురంపితే వస్తాడు అబ్బాయి సుకుమార్! రేప్రొద్దున్న నేను రమ్మన్నానని మన రామయ్యకి కబురంపు''

''తరువాత రేపు మీరు నావెంట వస్తే ఈ స్థలాన్ని దున్నించడానికి ఎవరైనా రైతుల్ని మాట్లాడాలి జత నాగళ్ళైతే సరిపోతాయి''

''అలాగే బాబా''

భూషణం ఆ రాత్రి భార్యతో -

''విశాలా! చాలాకాలమైంది ఇంట్లోని చాకిరి చేసుకోడమేకాదు, అంట్లగిన్నెలు, కంచాలు నువ్వో అమ్మాయో కడుగుకుంటున్నారు చేతులెలా ముద్దవుతున్నాయో చూడు వినోద్ ధర్మమా అని చేతిలో పన్నెండువందలు పైన పడ్డాయి చిల్లర అప్పులు మూడువందల వరకు వున్నాయి అవి తీర్చగా తొమ్మిదివందలపై నుంటాయి కొన్నాళ్ళు మనకు ఏ ఇబ్బందిలేదు ఎలాగూ బ్రతికేం గనుక కాస్త బాగానే బ్రతకడంలో తప్పు లేదనుకుంటా ఓ పనిమనిషిని పెట్టుకుంటే ఇల్లంతా తుడవడానికి, గిన్నెలు అవి కడగడానికి పనికివస్తుంది నీ ఆరోగ్యము అంత మంచిదికాదు పైగా లావణ్య ఆ అబ్బాయి ముందు ఇల్లు తుడవడం, గిన్నెలు కడగడం చేయడానికి ఇబ్బంది పడుతున్నట్లుంది — ఏమంటావు ?''

''మీ ఇష్టమండి''

ఆ మరునాటి నుండి ఇంట్లోని పనులు చేయడానికి రాజమ్మ, బయట పనులు చేయడానికి రామయ్య కుదిరేరు భూషణం, సుకుమార్ బయటకువెళ్ళి ఎనిమిదిగంటలయ్యేసరికి మనుషుల్ని, నాగళ్ళు, ఎద్దుల్ని తెచ్చేరు మధ్యాహ్నం వాళ్ళకు భోజనలుపెట్టి సాయంత్రం వరకు దున్నించేరు చాల కాలమైంది ఏ పోషణ లేకపోవడంచేత మట్టి గట్టిగానే వుంది ఆ రైతుల సలహాపై ఆ మరునాడు మళ్ళీ నూతి చుట్టూ వున్న భాగమంతా దున్నించేరు

''కమయ్యా — ఇక్కడ కూరగాయల్ని పండిద్దామనుకుంటున్నాము నీకు తెల్సిన రైతులెవరైనా వుంటే చెప్తావా ? జీతంమీద పని చెయ్యాలి కూరగాయల్ని కాపించడం తెలియాలి మంచి అనుభవం వున్నవాళ్ళకు మంచి జీతం ఇస్తాం,'' వినోద్ ఆ యిద్దరిలోని ఒక రైతుని అడిగేడు

''బాబా మా మేనల్లుడున్నాడు మెరికలాంటి కుర్రాడు వాడు నెల జీతంకు అంటే ఎగిరి గంతేస్తాడు కాస్త చదువుకున్నాడుకూడ మా ఎరకయ్య బామ్మరిది వున్నాడు, పనిలేక పొలాలమ్మట తిరుగుతున్నాడు ఏనుగులాంటి మనిషి ఎంత పనైన చెయ్యగలడు శ్రమనక మంచివాడుకూడ రేప్రొద్దున్న వాళ్ళిద్దర్ని పంపిస్తాను చూడండయ్యా''

''భేష్! అలాగేచెయ్యి,'' వినోద్ ఉత్సాహంగా అన్నాడు

ఆ మరునాడు ఆ మెరికలాంటి వెంకడిని, ఆ ఏనుగులాంటి మనిషి భీమయ్యను పనిలోకి తీసుకున్నాడు జీతంపైన వినోద్

వినోద్ ఏ పని చేసినా ముందుగా ఓ నిర్ణయం తీసుకుని, సలహా ఇస్తున్నట్లుగా సూచిస్తూ అన్ని పనులూ భూషణంచేతే చేయిస్తున్నాడు మనుష్యులను ఎంపికచేయడంలోను, జీతాల్ని నిర్ణయించడంలోను భూషణంకే ఆధిపత్యం ఇచ్చేవాడు తను వెనుకగా వుండి ఆవిధంగా భూషణం బొమ్మలా నిలబడవలసిన అగత్యం లేకుండా, తనూ ప్రముఖ పాత్రను వహిస్తున్నట్లు భావన కల్గించేవాడు దానితో భూషణం ఉత్సాహం ద్విగుణీకృతమైంది

అందువల్ల ఇంట్లోని సభ్యులందరికి తండ్రి ఊరకే కూర్చోలేదు, అన్నివిషయాలు చూసుకుంటున్నాడు, బ్రతుకుమీద మళ్ళీ ధైర్యంతో కూడిన కాంక్ష పెరిగిందన్న సంతృప్తి, ఆనందం కల్గేయి ఎవరో పూర్తిగా నాటకాన్ని ఆడిస్తున్నట్లు కాక తాముకూడ ఆ నాటకంలోని ముఖ్య పాత్రలం అన్న అందమైన గర్వం, తృప్తిని వినోదమూర్తి చాలా తెలివితేటలతో కల్గించేడు

వినోదమూర్తి రెండు రోజుల తరువాత మోటారుసైకిలుపై ఏలూరు వెళ్ళి తోట చుట్టు ఇనుపముళ్ళ కంచె వేయించడానికి ఏర్పాట్లు చేసుకునివచ్చేడు మరో నాల్గు రోజులకు లారీ ఒకటి వచ్చి తోటలో ఆగింది లారీనుండి కాంక్రీటు దిమ్మలు, ముళ్ళకంచె, పనిముట్లతో మనుష్యులు దిగేరు వాళ్ళను చూసి ఆశ్చర్య పోతుంటే అందరికీ వినోద్ చెప్పేడు తను చేసిన ఏర్పాటు గురించి

''ఈ తోట చుట్టు గోడ ఎత్తడానికి చాలా డబ్బు అవుతుంది ముఖ్యంగా చాలా కాలం పడుతుంది అందుకే ఈ ఇనుపముళ్ళ కంచెను ఏర్పాటు చేసేను ప్రతి పది అడుగులకు కాంక్రీటు దిమ్మలను పాతి వాటిమీదుగా ఈ ఆరడుగుల ముళ్ళ కంచెను కట్టుకుంటూపోతారు దీనివల్ల ఈ ప్రదేశానికంతటికి ఓ విధమైన రక్షణ ఏర్పడుతుంది పైగ ఈ స్థలమంతా మనది అని తెలుస్తుంది పశువులు ఏవీ తోటను పాడుచేయ డానికి వీలుండదు మన అనుమతి లేనిదే ఎవ్వరూ లోనికి రాకుండా చేయడం అవుతుంది''

''అబ్బాయి వినోద్! దీనికంతకూ చాలా డబ్బు అవుతుందే!'' భూషణం తన సందేహం వ్యక్తపరిచేడు

''అబ్బే — గాభరాపడవల్సినంత ఏమీకాదండి పైగా నేను వాయిదాలమీద ఇస్తానని చెప్పవచ్చాను కూడ మనకి ముందు ముందు వచ్చిన లాభాలతో మెల్లమెల్లగా తీర్చుకోవచ్చు,'' అని వినోద్ బొంకేడు నిజానికి డబ్బును పూర్తిగా చెల్లించె ఆ సామాన్లంతట్నీ రప్పించేడు

భూషణం, విశాలాక్షి ఆశ్చర్యంగా ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు అప్పుడు మొదటి సారిగా వాళ్ళకో సందేహం కల్గింది

ఈ వినోదమూర్తి ఎవరు ? ఇతడివద్ద ఎంత డబ్బుంది ? ఇంత చిన్నవయస్సులో ఇతడి కిన్ని విషయాలు ఎలా తెలిసేయి ? చిరునవ్వు చెదరనివ్వ కుండా ఇన్ని పనుల్ని ఎలా చెయ్యగల్గుతున్నాడు — ఇంత డబ్బును ఎలా ఖర్చుపెట్టగల్గుతున్నాడు ? ఏమిటీ రహస్యం ? ఇతడు మనతో ఎందుకింత అనుబంధం, ఆత్మీయత ఏర్పర్చుకుంటున్నాడు ఇతనివాళ్ళంతా ఏరి ? ఇతడి చర్యలు చూస్తుంటే గోపీ చెప్పినట్లు దేముడు పంపిన దూతలాగున్నాడే, మనపాలిట దేవత అయ్యేడు భూషణం, విశాలాక్షి



హైదరాబాదు ఆర్ట్ సొసైటీవారు జనవరిలో ఏర్పాటు చేసిన 38వ అఖిల భారత చిత్రకళా ప్రదర్శనలో అవార్డుని అందుకున్న పెయింటింగ్ 'అడవిలో దయ్యం'' ఈ చిత్రాన్ని శ్రీ పి ఆర్ రాజు వేశారు

# సూపర్ 777

## మురికికి ముప్పు, మెరుపుల తెలుపు






భారతదేశంలో లక్షలాది గృహిణులు మెచ్చిన
సూపర్ 777 డిటర్జెంట్ ఉతికె బార్

**హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో**

Shilpi dm. 15 A/78 Tel

చూపుల్లో అదే భావన ప్రస్ఫుటమౌతూంది.

మూడు రోజుల్లో ఆ వచ్చినవాళ్ళు తోట ఆవరణ చుట్టూ ఆ ముళ్ళ కంచెను, పెద్ద ఇనుప గేటును అమర్చి వినోద్‌కు, భూషణంకు నమస్కారం పెట్టి వినోద్ ఇచ్చిన కట్నం తీసుకుని వెళ్ళిపోయేరు.

అప్పటికి సాయంత్రం అయిదు గంట లౌతుంది. ఇంట్లోనున్నవారందరు తోటచుట్టు ఇంటిచుట్టు తిరిగి గేటువద్దకు వచ్చేరు. ఆసరికే రామయ్య ఆ పాలరాతిని శుభ్రం చేసివుంచేడు విశాలాక్షి ఆ అందమైన గేటును, గేటు స్థంభం మీదున్న ఆ పాలరాతి పలకమీద ముత్యాల్లాంటి అక్షరాలతోనున్న ఆనందనిలయం, దానిక్రింద కొత్తగా చెక్కిన అక్షరాలు 'విడుమర్తి రాజభూషణం'ను చూసి భూషణంతోపాటు ఆశ్చర్యపోయి, తరువాత ఆనందంతో కన్నీరు కారుస్తూ, అందరి సమక్షంలో వినోద్ రెండు చేతులను ప్రేమతో పట్టుకుని —

"నాయనా వినోద్! ఒచ్చే జన్మలో నీకు తల్లిని కావాలని ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తా. నీవంటి ఉత్తముణ్ణి కొడుకుగా పొందేకన్న గొప్ప వరం మరేమిటుంటుంది చెప్పు!"

వినోద్‌మూర్తి అందంగా నవ్వేసేడు.

"చూడండి అమ్మా — ఆ దేముడికి రోజా కొబ్బరికాయలు కొట్టి ప్రార్థిస్తే అప్పుడు ఆ దేముడు ఒచ్చే జన్మకుకదా నావంటి కొడుకు నిస్తాడు. మీరిప్పుడు ఓ కప్పు వేడి కాఫీ నాకిచ్చు కోండి, చూద్దురుగాని ఇవాళనుండే మీరే నా తల్లి అనుకుని ఇప్పటినుండే అలా పిలుస్తూ మరో జన్మవరకు వేచి ఉండవల్సిన అవుసరంలేకుండా చేస్తా!"

అందరూ సంతోషంతో నవ్వేసేరు.

"అమ్మా లావణ్యా — అబ్బాయికి సాయంత్రం ఆ రెండో కప్పు కాఫీ ఇవ్వడం మర్చిపోయేను ఈ సందడిలో. ఓ కప్పు కాఫీ కాచి ఇవ్వమ్మా. నేను, నాన్నగారూ మరోసారి మన స్థలమంతా తిరిగి చూసివస్తాము."

లావణ్య వెళ్ళిన కొద్ది నిముషాల తరువాత వినోద్ ఇంటిలోకి వెళ్ళేడు. మిగతావారంతా ఇంకా సంతోషంతో అలా తిరుగుతున్నారు చుట్టూ తెల్లగా మెరుస్తున్న ఇనుప కంచె. మధ్యమధ్య కాంక్రీటు స్థంబాలు. అందమైన పెద్ద గేటు ఆ ఆవరణంతటికి చక్కటి శోభను కల్గించింది ఒకప్రక్కన రెండెకరాల స్థలంలో బారులుగా తీర్చిదిద్దిన మట్టిని చూస్తుంటే — ఇక్కడ ఇంకా ప్రాణం ఉద్భవిస్తుంది. 'ఈ మట్టికి ఎంత మహత్తరశక్తి వుంది' అన్న ఆశ్చర్యం కల్గుతూంది చూసేవాళ్ళకు.

వినోద్ ఇంట్లోకి వెళ్ళేసరికి లావణ్య కాఫీ కలుపుతూంది.

"లావణ్యగారూ! పంచదార కాస్త తక్కువే వేయండి. నేను కాఫీని కాస్త బిట్టర్‌గావే త్రాగుతాను."

లావణ్య తలెత్తి చూచింది. వినోద్ ఒక్కడే వచ్చేడు.

# జీవిత మాధుర్యం

"మీరు శ్రమపడి వచ్చేరెందుకు? - నేనే తెచ్చుందునుకదా అక్కడికి."

"ఎంత మాట. మీరు అక్కడికి తెచ్చివ్వడం ఏం బాగుంటుంది. మీకీ శ్రమ చాలదనా? అందుకే నేనే వచ్చా పైగా ఇక్కడ కూర్చుని త్రాగవచ్చు."

లావణ్య ఏదో సందేహిస్తూ వినోద్ ముఖంలోకి చూసింది. వినోద్ సమ్మోహనంగా చిరునవ్వు నవ్వేసేడు లావణ్య సిగ్గుపడి తల దించుకుంది, ఏమనడానికి తోచక.

"లావణ్యగారూ! ఇంట్లో అందరు సరదాగా నాతో మాట్లాడుతారే మీరెందుకు నాతో మాట్లాడరు?"

"ఏం — నేనొకర్తిని మీతో మాట్లాడక పోతేనేం? అసలు నా స్వభావం — నేనెక్కువగా ఎవ్వరితోనూ మాట్లాడను. ఇంట్లోవాళ్ళతోనూ అంతే. అవుసరంమేరకే మాట్లాడేది."

"ఎక్కువగాకాకపోతేపోనీండి అసలు మీరు నాతో మాట్లాడటమేలేదే — అదే నా బాధంతా."

లావణ్య జవాబు చెప్పకుండా కాఫీకప్పును అందించింది




"చాలా థాంక్సండి — బాగా చేసేరు నా అభిరుచికి తగ్గట్టే చేసేరు. మీరు కోపగించుకోనంటే మిమ్మల్ని నేనొకటి కోరదామను కుంటున్నాను — కోరమంటారా?"

లావణ్యకు మళ్ళీ అదే అనుమానం కల్గింది. తలెత్తి చురుకుగా చూసింది. "చెప్పండి అదేమిటో."

"మరేంలేదు — ఈ ఊరికి మంచి తెలుగు సినిమా 'అమరదీపం' వచ్చింది. అందరూ చాలా బాగుంది అంటున్నారు. మీరు, నేను, వనజ, గోపీ, సుకుమార్ వెళ్దాం వస్తారా?"

"నాకిప్పట్లో సినిమా చూడాలనిలేదు. మీరు, తమ్ముళ్ళు, వనజ వెళ్ళిరండి."

"మీరు రాకపోతే నేను వెళ్ళను."

"అయితే వెళ్ళకండి."

"మీకు నామీద కోపమా?"

లావణ్య వినోద్ ముఖంలోకి చూసింది. ఆమె చూపులో ఏ కోపము లేదు. ఎంతో కృతజ్ఞత, సౌమ్యత, ఓ విధమైన అభిమానం స్ఫురిస్తున్నాయి. ఆ చక్కని చూపుకు వినోద్ హృదయం ఆనందంతో నిండిపోయింది.

"వినోద్‌గారు! మీ మనస్సుకు కష్టం కల్గిస్తే నన్ను క్షమించండి. మేమంతా ఎంత అఘాతంలోంచి, ఏఏ చీకటి పాతాళ్ళాల్లోంచి ఇప్పుడిప్పుడే మీ దయవల్ల బయటపడుతున్నామో మీకు తెలియదు అందుచేత ఇప్పుడు నేను సినిమాలకు, ఉత్సవాలకు రాలేను తరువాత మనస్సు కుదుటపడేక వస్తా — నన్ను క్షమించండి."

"అరెరె — అదెంతమాట! ఆనాలోచితంగా మీకు నేను బాధ కల్గించేనే తొందరేంలేదు. మనస్ఫూర్తిగా మీకు ఇష్టమైనప్పుడే వద్దురుగాని. మీరు దయచేసి పర్మిషనిస్తే నేను మీ తమ్ముళ్ళు రేపు రాత్రి 'అమరదీపం' చూసివస్తాం" అని వినోద్ మళ్ళీ చిలిపితనంలోకి వచ్చేడు.

"నా పర్మిషనెందుకండి — నేనేం ఇంటికి పెద్దనా," అని ఘాటుగా జవాబిద్దామనుకుంది గాని అతడి చిలిపిచూపుల్ని, ఆ చిద్విలాస చిరునవ్వును చూసేసరికి ఆమెకు నవ్వు వచ్చింది.

"సరే వెళ్ళిరండి," అని తన పర్మిషనిచ్చి, తనూ నవ్వేసింది.

"అదీ, అలా నవ్వుతూ ఉండాలి. అప్పుడే అందమూ, ఆనందమూ జీవితానికి. లావణ్యగారు! మీరు గంభీరంగా ఉంటే నాకెందుకో తప్పుచేసిన బడిక్కుర్రాడికిమల్లే భయం, భయంగా ఉంటుంది. మీరు మనసారా నవ్వుతూ ఉండండి, నాకు ఏనుగంత ఉత్సాహం కల్గుతుంది."

"భలేవారే!" లావణ్య మళ్ళీ నవ్వింది.

వినోద్ మనస్సంతా ఆనందంతో నిండి పోయింది.

అంతకు ఒక నిముషం ముందరే హాలులోకి వచ్చిన విశాలాక్షి ఆ తుది మాటల్ని విన్నది. ఆ నవ్వులను గమనించింది లావణ్య మళ్ళీ నవ్వగల్గుతున్నందుకు తనకు సంతోషం కల్గింది. మళ్ళీ ఏదో ఆలోచన గల్గి, నిట్టూర్పు విడచి మెల్లగా తన గదిలోకి పోయింది.

## 7

కాబేజి, కాలీఫ్లవర్, నూలుకోలు, టమాటా తాలూకు నారు తెప్పించేడు, అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు ద్వారా. అతడి సలహా, సంప్రదింపులతో అతడి సమక్షంలో నాటించడానికి ఉపక్రమించేడు.

ఓ మంచిరోజు చూసుకుని శాస్త్రులవారిని పిలిపించి పొద్దున్న ఎనిమిదిగంటలకు వినాయక పూజ చేయించేడు. తరువాత తోటలో అందర్నీ హాజరుపర్చేడు. విశాలాక్షిచేత కొబ్బరికాయ కొట్టించి ఆ కొబ్బరినీళ్ళను ఆ మట్టిలో పోయించేడు.

"అమ్మా! మీరు మొదటి నారుని ఈ వరుసలో గట్టుమీద నాటండి. తరువాత వరుసలో భూషణంగారు. అలా ఒక్కొక్క వరుసలో ఒక్కొక్కరు ఈ నారుని నాటండి. మిగతావి వెంకయ్య, భీమయ్య నాటుతారు."

"బాబూ! నీచేత్తోనే మొదటి నారుని నాటాలి — అప్పుడే బంగారం పండుతుంది. మా అదృష్టం మీద మాకంత నమ్మకంలేదుగాని

[ 33 వ పేజీ చూడండి ]

(మీకు ప్రెస్టిజ్ లేక ప్రీతి ప్రెషర్‌కుక్కర్ ఉన్నట్లయితే ఈ క్రింది ప్రకటనను కత్తిరించి ఉంచుకోండి.)

# ప్రకటన

## ప్రెస్టీజ్ నేషనల్ సర్వీసు సెంటర్







### ప్రెస్టీజ్ వల్ల అమితలాభం పొందండి

ప్రెస్టీజ్ ప్రెషర్‌కుక్కర్ మీకు జీవితాంతం శ్రమ లేకుండా చేయడానికే తయారు చేయబడింది. మీరు ఇరవైఏళ్ళ క్రింద కొన్నప్పటికీ నేటికీ అది మీకు బాగా ఉపయోగపడాలనేదే మా ఆశయం. ఇరవైలక్షలమందికి పైగాఉన్న మీలాంటి ప్రెస్టీజ్ కొనుగోలుదార్లకు సకాలంలో సమర్థవంతమైన సేవలను అందించాలనే ఒక కొత్తపథకం రూపొందించారు. ఈపథకంలో ఒక భాగంగా బెంగుళూరులోగల కంపెనీ ప్రధాన కార్యాలయంలో ప్రెస్టీజ్ నేషనల్ సర్వీసు సెంటర్ ఏర్పడింది.




### దేశవ్యాప్తంగా సర్వీసుకేంద్రాలు

ప్రెస్టీజ్ సర్వీసు పథకంలో ఇప్పటికే దేశవ్యాప్తంగా 350 ఆథరైజడ్ సర్వీసు కేంద్రాలు ఏర్పడ్డాయి. అందుచేత మీరు ఎక్కువదూరం వెళ్ళక్కరలేదు. అన్ని ఆథరైజడ్ సర్వీసుకేంద్రాలు ఆథరైసెషన్ సర్టిఫికెట్టును కలిగివున్నాయి. ప్రెస్టీజ్ సర్వీసు గుర్తుగల ఆసర్టిఫికెట్టుకోసం చూడండి. తక్కువధరలో మంచి స్పేరు పార్టులకు, కంపెనీలో శిక్షణపొందిన టెక్నిషియన్లచే నమ్మకమైన సర్వీసుకు మీకు హామీ ఇస్తున్నాం. ప్రెస్టీజ్ సర్వీసు రేటుకార్డు చూపించమని అడగండి.



### మంచి ప్రెస్టీజ్ స్పేర్‌లను పొందండి

కొత్త ఐ. ఎస్. ఐ. గుర్తుగల గాస్కెట్, కొత్తలోహపు సేఫ్టీవాల్వు వంటి మంచి ప్రెస్టీజ్ స్పేర్లను మీరు నిశ్చయంగా పొందండి. జీవితాంతం సమర్థవంతమైన పనితనాన్ని కలిగి ఉండేందుకు వీలుగా అన్ని ప్రెస్టీజ్ స్పేర్‌లను నాణ్యమైన ముడిపరికరాలనుండి తయారు చేయడం జరిగింది. వాటి నాణ్యతనుకూడా సమగ్రంగా పరీక్షించడం జరిగింది. ఉదాహరణకు, ప్రెస్టీజ్ గాస్కెట్ జాగ్రత్తగా వాడినట్లయితే కనీసం రెండేళ్ళు తప్పకుండా ఉపయోగ పడుతుంది. దృఢమైన నమ్మకం ఏర్పడాలంటే ప్రెస్టీజ్ ఆథరైజడ్ సర్వీసు కేంద్రాలకు వెళ్ళడమే ఉత్తమమైన మార్గం.



### నేషనల్ సర్వీసు సెంటర్ ఏవిధంగా సహాయపడుతుంది?

350 ఆథరైజడ్ సర్వీసు కేంద్రాల విధులకు అనుబంధంగా 9 ప్రాంతీయ సర్వీసుకేంద్రాల సహాయంతో, ప్రెస్టీజ్ నేషనల్ సర్వీసుసెంటర్ ఒక సమన్వయ సమాచార శాఖగా పనిచేస్తుంది. మంచి ప్రెస్టీజ్ స్పేరుపార్టులకు, నమ్మకమైన సేవలకు ఎక్కడికి వెళ్ళాలో తెలియకపోతే మాకు వ్రాయండి. మేము మీకు తెలియజేస్తాం.




### మాకు వ్రాయండి మీ సేవలకు మేమెల్లప్పుడూ సిద్ధమే

మీకు సమీపంలో ఉన్న సర్వీసుకేంద్రం చిరునామాను తెలియజెయ్యడమేకాక నేషనల్ సర్వీసు సెంటర్ మీకు ఇంకా ఎక్కువ సహాయపడుతుంది. మీ ప్రెస్టీజ్ నుండి అమితమైన లాభం ఎలాపొందాలో తెలుసుకోవాలన్నా, మీప్రాంతములోవున్న ఆథరైజడ్ సర్వీసు కేంద్రాల జాబితా కావాలన్నా ఈ క్రింది కూపనను పూర్తిచేసి పంపించండి. మీకు ఎలాంటి ఇబ్బందులున్నా, లేక మీరు ఎలాంటి సూచనలు చేయాలనుకున్నా, వ్యక్తిగతమైన సేవలను మీకు సంతోషపూర్వకంగా అందిస్తాం.

కన్స్యూమర్ సర్వీసు మేనేజర్,
ప్రెస్టీజ్ నేషనల్ సర్వీసు సెంటర్,
టి టి. (ప్రైవేటు) లిమిటెడ్,
దూరవాణినగర్, బెంగుళూరు-560 016.

T/53 Tel

ASV 2

పేరు ..........................................
చిరునామా ..........................................
..........................................
..........................................
..........................................
బ్యాచ్‌నంబరు ..........................................
(మూతలోపలిభాగం చూడండి)
కొన్నసంవత్సరం ..........................................

ప్రెస్టీజ్ వల్ల అమితలాభం పొందండి
Prestige

ఈ కూపనును పంపండి




ప్రెస్టీజ్
భారతపు ప్రప్రథమ మరియు విరివిగా ఉపయోగింపబడుతున్న ప్రెషర్ కుక్కర్



'రామ బాణం'లో కృష్ణంరాజు, శోభన్‌బాబు

## పాఠకులకు తీపివార్త

"మనుషులంతా ఒక్కటే" చిత్రం అనూహ్య విజయాన్ని సాధించిన విషయం పాఠకులకు తెలుసు. శ్రీ ఎన్టీఆర్... శ్రీ డిఎన్ఆర్ కలయికతో మరెన్నో హిట్ చిత్రాలు వరుసగా వస్తాయి అని ఎందరో ఎదురుచూశారు. దేనికయినా కాలం కలిసిరావాలిగా.

మూడు సంవత్సరాల తరువాత శ్రీ ఎన్టీ రామారావు కథానాయకుడు, తమిళ చిత్ర నిర్మాత శ్రీ గోల్డెన్ బెరియన్ నిర్మించనున్న సాంఘిక వర్ణ చిత్రానికి, శ్రీ దాసరి దర్శకత్వం నిర్వహించడం... పాఠకులకు తీపివార్తేగా, మరి.

ఆగస్టులో యీ హిట్ జంట కలిసి పనిచేసే చిత్రం ప్రారంభమై... విజయదశమికి ప్రేక్షకులకు కన్నులపండుగ చేస్తుందని తెలుస్తూంది.

ఎన్టీఆర్... డి. ఎన్. ఆర్. కలయిక మరో విజయాన్ని చవిచూడాలని యీ కలం ఆశిస్తూంది.

## డి. ఎన్. ఆర్. ఎంత బిజీ?

జర్నలిస్టుగా నాకు ఈ చిత్రపరిశ్రమతో 11 సంవత్సరాల బంధుత్వం వుంది. ఈ 11 ఏండ్లలో శ్రీ దాసరి ఎంత పెరిగారో, "తాత ... మనవడు" చిత్రం రషస్ చూచినప్పుడే ఈ కలం ప్రెడిక్ట్ చేసింది.

ఈనాడు శ్రీ దాసరి చవిచూస్తున్న వైభవం ... ఏ దర్శకుడు అనుభవించివుండరేమో!

కడచిన కష్టజీవితాన్ని నెమరువేసుకునే వ్యక్తి గనుకనే ... శ్రీ దాసరి ఇంకా ఎదుగుతారనేది నమ్మకం అందరికీ వుంది.

దాసరి నారాయణరావుగారి చిత్రం అంటే... మినిమమ్ గ్యారంటీ వుంటుంది అనేది నమ్మకం ప్రేక్షకులకు ఏర్పడింది గనుకనే ... ఆయన 'స్టార్ డైరెక్టర్" అయ్యారు.

ప్రస్తుతం శ్రీ దాసరి ఎంత బిజీ అంటే ... 1980 ఫిబ్రవరి వరకు ఒక్కరోజు విశ్రాంతి లేనంత. విజయా పిక్చర్స్, విజయ ... మాధవీ పిక్చర్స్, అన్నపూర్ణా స్టుడియోస్, లక్ష్మి ఫిలింస్ కంబైన్స్, తారకప్రభు ఫిలింస్, గోల్డెన్...బెరియన్ చిత్రం, యువ చిత్ర, భాగ్యనగర్ స్టుడియోస్, శ్రీ లలితా ఎంటర్‌ప్రైజస్, సిరిపురంలో ఓ సిన్నోడు, హిందీ నటుడు జితేంద్ర నిర్మిస్తున్న హిందీ చిత్రం, శ్రీలక్ష్మీనరసింహా ఇంటర్నేషనల్. ఇవిగాక "నీడ", పబ్లిసిటీ వెంకట్రావుగారి చిత్రం ... మరో ముగ్గురికి శ్రీ దాసరి చెయ్యడానికి అంగీకరించారు.

1980 మార్చి నుంచి ఇచ్చినా ఫర్వాలేదు... అని అడిగే నిర్మాతలు అరడజనుమంది శ్రీ దాసరి యింట కనిపిస్తున్నారు.

"తను కావాలి" అని వచ్చేవారిని నొప్పించి పంపడం చేతగాదు ... శ్రీ దాసరికి.

## నూతనత్వం ప్రసాద్‌కు వరం

ఈమధ్య ఒక సినిమాను అంటే... "కలియుగ మహాభారతం"ను చూశాను. సాంఘిక సుయోధన పాత్రకు నూతన్‌ప్రసాద్ ప్రాణంపోశారు అని వ్రాసితీరాలి. ఎంత నూతనత్వం ఆయన నటనలో అగుపించిందో ... అంత నూతనత్వం ఆయన వాచికంలో పలికింది. "హ్యాట్స్ ఆఫ్ టు హిమ్." 1979లో నూతన్‌ప్రసాద్ "ఆల్‌రౌండర్" కాగలరేమో! అన్ని పాత్రలు పోషిస్తున్నారు గనుక.

## బడాయి బసవయ్య

"కలియుగ మహాభారతం" స్కోప్ వర్ణ చిత్రాన్ని నిర్మించిన శ్రీ గుండా సత్యనారాయణ, మార్చిలో ప్రారంభించనున్న హాస్యరసప్రధానమైన రంగుల చిత్రమే "బడాయి బసవయ్య."

శ్రీ పరుచూరి కథ, మాటలను సమకూర్చే ఈ చిత్రానికి శ్రీ హనుమాన్‌ప్రసాద్ దర్శక ... చిత్రానువాదకుడు.

ఈ నవ్వుల చిత్రంలో నూతన్‌ప్రసాద్, హరిబాబు, పి. ఎల్. నారాయణ, రూప, శైలజ గాక ఒక అగ్రశ్రేణి నాయిక ప్రధాన పాత్రధారులు.

## విజయచందర్ జయించాడు

"కరుణామయుడు" చిత్రాన్ని తలపెట్టినప్పుడు... క్రీస్తు పాత్రధారి శ్రీ విజయచందర్ ఓ భీషణ ప్రతిజ్ఞ చేశారు. ఆ ఏసుప్రభువు తనపై ఆశీస్సులు చల్లడం తథ్యమని ... "కరుణామయుడు" చిత్రాన్ని సకలజనులు ఆదరించగలరని, విజయచందర్ అన్నారు.

"కృషి... దీక్ష... భక్తి... శ్రద్ధ... ఆసక్తి" అనేడి పంచాయుధాలను నమ్మిన విజయచందర్ గారికి... ఆ దేవుడు పేరు ప్రతిష్ఠలనేగాక... ధనలాభాలను కూడా యిచ్చాడు.

విచిత్రమేమిటంటే... "కరుణామయుడు" చిత్రాన్ని చూచే ప్రేక్షకులు ఏసు పాత్రధారిపట్ల అనిర్వచనీయమైన అనుభూతిని పొందుతున్నారు. "ప్రభువు" యిలాగే వుంటాడేమో అని ప్రేక్షకులు "విజయచందర్"ను మెచ్చుకుంటున్నారు.

## గౌతమబుద్ధుడు!

విజయచందర్ తలపెట్టదలచిన మరో మహత్తర ప్రయత్నం... "గౌతమబుద్ద" చిత్ర నిర్మాణం. ఆయన సమయస్ఫూర్తిని... సముచిత నిర్ణయాన్ని యీ కలం నిండుగా ఆశీర్వదిస్తూంది.

ఎందుకంటే... గౌతమబుద్ధుడి పాత్రకు విజయచందర్‌గారి రూప లావణ్యాలు సరితూగుతాయి.

గౌతమబుద్ధుడుగా రూపం ధరించడానికి నిర్ణయించిన శ్రీ విజయచందర్‌కు ఒక మంచిసలహా.

"అశోకా ది గ్రేట్"గా కనిపించి... ఆ తరువాత బుద్ధ భగవానుడు... ఆటుపిమ్మట వివేకానందుడుగా నటించడం, మంచిదని యీ కలం కోరుతూంది. "అడ్డమైన ఆఫర్లకు విజయచందర్ గుడ్‌బై కొట్టాలి."

'పెద్దిల్లు — చిన్నిల్లు' లో



## ముసలితనంలో పడుచుదనం

ఇది సినిమా పేరు అనుకునేరు. సినిమా రంగంలో అనుభవజ్ఞుడు... మంచివాడు అయిన ఒక వృద్ధ ప్రముఖుడికి యీ పేరు వర్తిస్తుంది. ఆ వ్యక్తి జగమెరిగిన ప్రతిభావంతుడు. పద్మశ్రీ పిక్చర్స్ నిర్మించే చిత్రాలకు నిర్దేశకుడు. పేరు పి. పుల్లయ్య.

ఇటీవల ఆయనగారిని ఒక శతదినోత్సవ సభలో చూశాను. అరవై ఎనిమిది అని ఆయన చెప్పారు. కానీ, ఆయనకు నలభై మించి వుండదేమో అనిపించింది. నలభైలో వుండే నడివయస్కుడిలో ఎంత వుత్సాహం... వుషారు, అరవై ఎనిమిదేండ్ల పుల్లయ్యగారిలో అగుపించాయి.

మనసులో కల్మషంలేని వ్యక్తి గనుక, స్వార్థచింత యిసుమంతయినా లేనివాడు గనుక, పరోపకారం ధ్యేయంగా గొన్నవాడు గనుక... ఆయనలో వార్ధక్యం ఏమాత్రం గోచరించలేదు.

సంతృప్తి... సంతోషం ఆయనకు రక్షగా, శక్తిగా నిలబడుతున్నాయి.

## అక్కినేని మా అబ్బాయి !

పద్మశ్రీ పిక్చర్స్ నిర్మించిన చిత్రాలలో అధిక శాతం నటించిన నటుడు శ్రీ నాగేశ్వరరావు ''అక్కినేని మా అబ్బాయి'', అన్నారు శ్రీ పుల్లయ్య అంత ఆత్మీయతాభావం వుంది గనుకనే.. ఆ రోజుల్లో అక్కినేనిగారితో హైదరాబాదులో చిత్ర నిర్మాణానికి వుపక్రమించారు.

శ్రీ అక్కినేనికి... పుల్లయ్యగారిపట్ల పితృభావం... పూజ్యభావం వుంది. గనుకనే... ఆయన ఎప్పుడు మదరాసు వచ్చినా... ఒక పూట ''పుల్లయ్య ... శాంతమ్మ''గారి వంటను రుచి చూస్తారు.

మోహన్‌బాబు, దీప





'మావారి మంచితనం'లో రామారావు, జగ్గయ్య

## కథ కోసం అన్వేషణ

నాగేశ్వరరావుగారు అన్ని రకాల పాత్రలను పోషించారు. వైవిధ్యం వున్న పాత్రను సృష్టించే కథను వ్రాయమని, రచయితలకు చెప్పాను. సరైన కథ లభించడమే తరువాయి ... పద్మశ్రీ నుంచి ''స్వీట్ న్యూస్'' వస్తుంది, అన్నారు శ్రీ పుల్లయ్య.

## హిందీలో గుండమ్మ కథ

విజయా పిక్చర్స్ అధినేత శ్రీ నాగిరెడ్డి, ''గుండమ్మకథ'' చిత్రాన్ని శ్రీ దాసరి దర్శకత్వంలో హిందీలో తలపెట్టారు. శ్రీ ఎన్టీఆర్ పాత్రకు సంజీవ్‌కుమార్, శ్రీ ఏఎన్ఆర్ పాత్రకు రాజేష్‌ఖన్నా, సావిత్రి ... జమున పాత్రలకు రాఖీ, మవుసమీ చటర్జీని, శ్రీ రంగారావు పాత్రకు అశోక్‌కుమార్‌ను ఎంపికచెయ్యమన్నట్టు తెలిసింది.

## ఉత్తరాదిన తెలుగువాడి వైభవం

విజయా పిక్చర్స్ నిర్మించిన ''స్వర్గ్...నరక్'' హిందీ చిత్రం విడుదలయిన అన్ని కేంద్రాలలో అఖండ స్వాగతానికి, అద్వితీయవిజయానికి నోచుకుంది. దర్శకుడుగా శ్రీ దాసరి వైభవం యిక్కడేగాక ... అక్కడకూడా పరిమళిస్తున్నది.

దక్షిణభాషా దర్శకులకు కీర్తిని మళ్లీ బొంబాయి రంగంలో తెచ్చిన శ్రీ దాసరిని, తెలుగువాళ్లందరు అభినందించాలి.

స్వదేశీ ... విదేశీ నటులతో, భారీ హంగామాలతో విడుదలైన ''షాలిమార్'' చిత్రాన్ని ... మన తెలుగు దర్శకుడి కుటుంబగాథా చిత్రం అధిగమించి ... వసూళ్లలో అధిరోహించడం మనందరికి గర్వకారణమేగా, మరి.

## గిరిబాబు కథకు శారద నాయిక

నటుడు శ్రీ గిరిబాబు రెండు జానపద చిత్రాలను నిర్మించిన విషయం పాఠకులకు తెలుసు. మొదటి చిత్రం ''దేవతలారా దీవించండి'' పేరుకు సాంఘికమే అయినా...అందులో జానపదశైలిని... గిరిబాబుగారు ఎంతో నేర్పుగా యిమిడ్చి ... విజయాన్ని సాధించారు. రెండవ చిత్రం ''సింహగర్జన'' గూర్చి మీ అందరికీ తెలుసు.

ఇప్పుడాయన ఒక చక్కటి కుటుంబ కథను వ్రాశారు. ఆయన వ్రాసిన కథకు శ్రీ వాసు దర్శకుడుగా ఎంపిక అయ్యారు. ''వదినమ్మ''గా శ్రీమతి శారద నటించగలరని తెలిసింది. మకుటానికి మాణిక్యంలాంటి నటిని ఎంపిక చేసిన కథకుడు శ్రీ గిరిబాబును అభినందించాలి.

## శారద అంగీకరించిన అందమైన పాత్రలు

ఉత్తమశ్రేణి పాత్రలను మాత్రమే అంగీకరించడం ... మన శారదగారికి అలవాటు అలవాటును అతిక్రమించడం ఆమెకు చేతకాదు.

ఇప్పుడామె అందమైన పాత్రలను (విలక్షణమైనవి) అంగీకరించింది.

నటుడు ... కథకుడు శ్రీ ప్రభాకరరెడ్డి, శ్రీ లక్ష్మీదీపక్ దర్శకత్వంలో తీస్తున్న ''కార్తీక దీపం'', వ్యాపారవేత్త, నిర్మాత శ్రీపతిరావుగారు, శ్రీ దుర్రై దర్శకత్వంలో నిర్మిస్తున్న ''ప్రియబాంధవి'', నిర్మాతలు ప్రేమ్ ... కిషన్, శ్రీనివాసరావు దర్శకత్వంలో రూపొందిస్తున్న ''మా యింటి జ్యోతి''.

## దిలీప్‌కుమార్‌తో శారద ?

హిందీ చిత్ర రంగంలో యిప్పటికీ ''నెంబర్ వన్'' హీరోగా పరిగణింపబడుతున్న దిలీప్‌కుమార్‌తో... మన ''శారద'' నాయికగా నటించే ఓ భారీ వర్ణ చిత్రాన్ని ... అక్కడి ప్రముఖులలో ఒకరైన నజీర్‌హుసేన్ నిర్మించగలరని తెలుస్తోంది.

తెలుగు నిర్మాతలు అప్పుడప్పుడు మన ''శారద''నుమరిచిపోతున్నా... కేరళ చిత్రనిర్మాతలు ఆమెకు ఆదినుంచి బ్రహ్మరథం పడుతూనే వున్నారు.

అక్కడివాళ్లకు మన శారద ''దేవత''.ఆమెకు అక్కడ జరిగే రాజోపచారం ... వర్ణనాతీతం.

# సినిమా

## నటరత్న నూతన పథకాలు

పట్టుదలకు, పరిశ్రమకు పెట్టిందిపేరు నటరత్న శ్రీ ఎన్. టి. రామారావు "అనుకున్నది సాధిస్తారు చెప్పింది చేస్తారు" నటరత్న "అల్లూరి సీతారామరాజు" చిత్రాన్ని ఏనాటికైనా తీస్తానని యిటీవల ఒక పత్రికా సమావేశంలో ప్రకటించారు ఎన్. టి. ఆర్. "డ్రైవర్ రాముడు" చిత్రం విడుదలయ్యాక "శ్రీమద్విరాటపర్వం" చిత్రాన్ని తన జన్మదిన కానుకగా (28–5–79) విడుదల చేయదలచినట్టు, "తిరుపతి వెంకటేశ్వర కల్యాణం" చిత్రాన్ని విజయదశమికి రిలీజ్ చేయదలచినట్టు, "పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి", "ఉత్తరరామ చరిత్ర", "తమ్ముడిపెళ్లి, మామ భరతం" మున్నగు సబ్జెక్ట్స్ తన దగ్గర రెడీగా వున్నట్టు, అతిత్వరలో భాగ్యనగరంలో ఒక కలర్‌లాబ్, రికార్డింగ్ థియేటర్ ప్రారంభించదలచినట్టు ఆ గెట్టుగెదర్‌లో వెల్లడించారు.

## నందమూరి కొత్త చిత్రాలు

నవశక్తి గంగాధరరావుగారి చిత్రం ఇటీవలె హైదరాబాద్‌లో ప్రారంభమయింది. ఈ చిత్రానికి నందమూరి రమేశ్ దర్శకుడు. ఎన్. టి. ఆర్., జయసుధ ప్రధాన జంట. రోజ్ మూవీస్ శ్రీ కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో నిర్మించే చిత్రంలో ఎన్. టి. ఆర్. హీరో. మాధవీ రాజేంద్రప్రసాద్ శ్రీ తాతినేని రామారావు దర్శకత్వంలో నిర్మించే చిత్రం, శ్రీ రాజేంద్ర కుమార్ శ్రీ కె. బాపయ్య దర్శకత్వంలో నిర్మించే చిత్రంలో కూడా శ్రీ రామారావు కథానాయకుడు.

## ముగ్గురు రాజుల చిత్రంలో కృష్ణంరాజు

ఇది కృష్ణంరాజుగారి సీజను ఒక సమర్థుడికి ప్రేక్షకులు సరయిన తీర్పునిస్తున్న సీజను అగ్రనటులిద్దరు చెయ్యదగిన పాత్రలకు తను సరిపోతాను అని నిరూపించిన సీజను

"రుద్రయ్య"గా ఎంత భయంకరంగా ... రౌద్రంగా నటించారో ... "పాండవులు"లో శాంతంగా, సటిల్‌గా శ్రీ కృష్ణంరాజు నటించారు.

ముగ్గురు రాజులు కలిసి ఒక కొత్తతరహా సాంఘిక చిత్రాన్ని, శ్రీ కృష్ణంరాజుతో తలపెట్టారు. శ్రీయుతులు ఎన్. వి. సుబ్బరాజు, ఏ. వి. రాజు, సత్యనారాయణరాజుగార్లు కలిసి ఓ సంస్థను నెలకొలిపారు. సంస్థ పేరు : రాధాకృష్ణ ఆర్ట్ కంబైన్స్.

"త్రీ...రాజా"లు నిర్మించే రంగుల చిత్రానికి శ్రీ జాన్సన్ కథ...మాటలు సమకూరుస్తున్నారు కథలో ప్రాముఖ్యం వున్న మూడు పాత్రలను శ్రీ కృష్ణంరాజు పోషించగలరని తెలిసింది.

ఈ చిత్రానికి శ్రీ పి. చంద్రశేఖరరెడ్డి చిత్రానువాదాన్ని...దర్శకత్వాన్ని, సత్యం సంగీతాన్ని నిర్వహిస్తారు.

ఏప్రిల్ ప్రాంతంలో షూటింగు ప్రారంభం అవుతుందని, నిర్మాతలలో ఒకరైన సుబ్బరాజు తెలిపారు.



'ఇల్లాలి ముచ్చట్లు'లో ప్రభ, మురళీమోహన్

## ఇది విన్నారా?

★ "విఠలాచార్యగారికి సాధారణంగా ఎవ్వరూ కాల్‌షీట్ ట్రబుల్ ఇవ్వరు. పొరబాటున ఇవ్వడానికి ప్రయత్నిస్తే నష్టపోయేది ఆర్టిస్టేగానీ, ఆచార్య కాదు. ఆ ట్రబుల్ సమ్ ఆర్టిస్టు క్యారెక్టర్‌ను ఏ పాముగానో, జంతువుగానో మార్చి చిత్రం పూర్తిచేస్తారు" అంటాడు ఒక ప్రముఖ నటుడు. నిజమేమరి విఠలాచార్యగారితో కీ. శే. చిన్నప్పదేవర్ గారితో మజాకా పనికిరాదు. ఆర్టిస్టు లేకుండానే చిత్రాన్ని పూర్తిచేయగల సమర్థులు వారిద్దరూ.

★ జీనత్ అమన్ ఒక కాలేజి కుర్రాడ్ని ప్రేమిస్తోందట. అతని పేరు రాబిన్. అతనికయ్యే ఖర్చులన్నీ జీనత్ భరిస్తూందట.

★ యువతరం నటుడు కమల్‌హాసన్ "కమల్‌హాసన్ ఫిలిం ఫాక్టరీ"ని స్థాపించాడు. ఈ ఫాక్టరీ నుంచి వచ్చే చిత్రాన్ని కె. బాలచందర్ డైరెక్ట్ చెయ్యొచ్చు, లేక తనే డైరెక్ట్ చెయ్యొచ్చు లేక మరొకరు డైరెక్ట్ చెయ్యొచ్చు అంటున్నాడట డైరెక్టర్ ఎవరు అనడిగితే. ఏమిటీ విడ్డూరం! కమల్‌హాసన్ ఫిలింస్ లేక ప్రొడక్షన్స్ అని పెట్టుకోక ఫాక్టరీ అని పెట్టడంలోగల ఆంతర్యం ఏమిటని అడిగితే, "నా సంస్థనుంచి చాలా చిత్రాలు వస్తాయి. ఆ చిత్రాల్ని చాలామంది డైరెక్ట్ చేస్తారు. ప్రతిది చాలా చాలా కాబట్టే ఫాక్టరీ అన్నాను" అంటారు కమల్‌హాసన్. ఏ న్యూవేవ్ ఇన్‌డీడ్.

★ కీ॥ శే॥ శ్రీ చిన్నప్పదేవర్ సుబ్రహ్మణ్య స్వామి భక్తుడు. దాదాపు అన్ని కుమారస్వామి ఆలయాల నుంచి శ్రీ దేవర్‌కు స్వామి నడుముకు కట్టిన ఉత్తరీయాలు పంపబడుతుండేవట. వాటిమీద పన్నీరు చల్లి, ఆ తీర్థాన్ని పిండి, భక్తితో సేవించేవారట శ్రీ దేవర్. ప్రస్తుతం ఆ పాలసీని ఫాలోకావాలని చాలామంది నిర్మాతలు తహతహలాడుతున్నారట. విత్తంతో ఉత్తరీయాల నైతే సంపాదించగలరేమోగానీ చిత్తంతో ఆ స్వామి దయను సంపాదించగలరా అనేదే సందేహం.

★ డింపుల్ చెల్లెలు సింపుల్ ఒక తమిళ చిత్రంలో నటించడానికని బొంబాయి నుంచి మద్రాసొచ్చింది. ఈమె క్లాస్ సిగరెట్లు కాలుస్తూందట. ఈ విషయం తెల్సుకున్న కొందరు నటులు యఫ్. యస్. గానే సిగరెట్లు కొట్టేస్తున్నారట ఆమె దగ్గర్నుంచి. ఒక ఆడ తార సిగరెట్ కాల్చడమే ఒక ఫాన్సీ. క్లాస్ సిగరెట్ కాలుస్తుందంటే తాను కాస్ట్లీ అని నిర్మాతలకు తెలియజేస్తుందా? అనే కలవరం బయల్దేరింది సినీలోకంలో.

★ చిత్రలేఖనం, ఫోటోగ్రఫీ అంటే మక్కువట శ్రీప్రియకు. ఆ రెండింటికి వలసిన సామగ్రిని కూడా కొన్నదట శ్రీప్రియ. ఇది హాబీ అనుకున్నారట అందరూ. కానీ విచారించగా, "ఈ సినీపరిశ్రమ రేసుకోర్సులాంటిది. ఎల్లప్పుడూ ఏ ఒక్కరో జాక్‌పాట్ కొట్టడం అసాధ్యం. అందుకే అడ్వాన్స్‌గానే నా అరేంజ్‌మెంట్స్ నేను చేసుకున్నాను" అంటూందట శ్రీప్రియ. ఆమె దూరదృష్టికి జోహార్లు

– శ్రీనివాస్ ★

# మిరమిట్లు గొల్పే తెలుపు
# చూడగానే
# అందరి నోట ఒకే మాట...

ఇది తప్పక

## డెట్

డిటర్జెంట్
బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel



'శాంతి'లో జయప్రద, మాధవి

## జి. వి. జి. పేజీ

''రెండు నాలుకలు!'' అని సభికుల్లోంచి ఎవరో అరిచారు.

''కొండనాలుక లేకపోతే మాట రాదు. బండ మాట వాడకపోతే నవ్వు రాదు. ఖర్చుఅయిపోయింది రాదు గనుక నిన్నటివరకూ మంత్రిగా వున్నవాళ్ళని మర్చిపోవాలి. అప్పు తెచ్చుకోవడం ఈ దేశానికి ఆచారం గనుక రేపు మరో మంత్రిగారిని తెచ్చుకోవాలి. అదే రాజకీయం ... ఆమాటకొస్తే, ప్రపంచంలో శాంతికాముకులు ఎంతమంది వున్నారండి? లింకన్, గాంధీ, కెనెడీ, నెహ్రూజీ, నేనూ...'' మంగళగిరి వాగ్ధాటికి అడ్డు లేదు.

''ఇలాంటి కబుర్లను నమ్మి అమాయకపు ప్రజలు వోటువేసి గెలిపిస్తే, ఏమౌతుంది?'' అన్నారు ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ ''అంతులేని వింత కథ'' వర్ణ చిత్ర నిర్మాత కె. రాఘవ. ఆయన ఈ చిత్రం ద్వారా పరిచయం చేస్తూన్న కొత్త దర్శకుడు మోహన్‌దాస్ కథ, స్క్రీన్‌ప్లే, మాటలు కూడా సమకూర్చారు. ఫిబ్రవరి విడుదల.

### తారల పెళ్ళిళ్ళు

నటి సత్యప్రియ, కన్నడ చిత్ర నిర్మాత ఎస్. ఎస్. ముకుంద్‌ను ఫిబ్రవరి 18న తిరుపతిలో వివాహమాడబోతోంది. వరుడు కన్నడ నటి ఆరతికి అన్న. పెళ్ళయ్యాక కూడా చిత్రాల్లో నటిస్తానంటోంది సత్యప్రియ. నటి – నర్తకి మంజుభార్గవి వివాహం మే మాసంలో జరుగుతుంది. ''వారు అమెరికాలో ఉన్నతోద్యోగి. నేనక్కడ డాన్సింగ్ స్కూల్ ప్రారంభిస్తాను,'' అంది మంజు. త్వరలోనే మరో తార కూడా ఈ జాబితాలో చేరబోతున్నట్లు తెలుస్తోంది.

### భానుమతీ రామకృష్ణ చిత్రాలు

''మావారి ఆరోగ్యం అమధ్య కాస్త బాగోలేనందువల్ల వారికి సెక్రెటరీగా ఉండి ఆఫీసు వ్యవహారాలన్నీ చూస్తూ వచ్చా. ఇప్పుడు వారి ఆరోగ్యం కుదుటపడింది. నేను చిత్రాలు తియ్యొచ్చని గ్రీన్ సిగ్నల్ ఇచ్చారు. నేను చక్కని ఆర్టిస్టని వారు గుర్తించినట్లున్నారు,'' అన్నారు డాక్టర్ భానుమతి నవ్వుతూ. పక్కనే ఉన్న రామకృష్ణగారు కూడా నవ్వారు ''తొలిసారిగా ఆంధ్రప్రదేశ్‌లో చిత్రాలు తీస్తున్నాం, స్వామీ! తొలిసారిగా కలర్‌లోనూ తీస్తున్నాం. ఒకటి సాంఘికం. మరొకటి సస్పెన్స్ థ్రిల్లర్. మూడవది పౌరాణికం. సులక్షణా మూవీస్ బేనర్‌లో తయారయ్యే 'రచయిత్రి' చిత్రానికి కథ, సంగీతం, దర్శకత్వం నేనే. నాతోపాటు సుధాకర్, అభిలాష, పద్మనాభం, రమాప్రభ, రాజసులోచన పాల్గొంటారు. డి వి. నరసరాజుగారు సంభాషణలు రాస్తున్నారు. గూడూరు దగ్గర కోటలో షూటింగ్ ప్రారంభమౌతుంది. రెండోవది మీనాక్షి ఫిలిమ్స్ బేనర్‌లో తయారౌతుంది. నాతోపాటు చక్రపాణి, మోహన్‌రాం, చంద్రకాంత్, జి. శ్రీనివాస్ అనే కొత్త నటులు పాల్గొంటారు. అభిలాష, హేమసుందర్‌లు కూడా ముఖ్య పాత్రలు ధరిస్తారు. యం. ఎస్. విశ్వనాధంగారు సంగీత మిస్తారు. భరణీ ఫిలిమ్స్ బేనర్‌లో తయారయ్యే ''భక్త ధ్రువ'' చిత్రానికి కమలాకర కామేశ్వరరావు గారు డైరెక్టరు. నేను రాసిన స్క్రీన్‌ప్లేకు నరసరాజుగారు సంభాషణలు రాస్తున్నారు. రాజేశ్వరరావుగారు సంగీతమిస్తారు. సులక్షణా మూవీస్ పతాకంలో తయారైన 'నేరం ఎవరిది?' చిత్రం మార్చిలో విడుదలవుతుంది. ఇందులో బాధ్యత గల లాయర్‌గా, బిడ్డకు దూరమైన తల్లిగా, గృహధర్మం నిర్వర్తించే సహధర్మచారిణిగా నటించాను. వెస్టరన్ మ్యూజిక్‌లో రెండు పాటలు పాడాను. వింటారా?'' అంటూ వినిపించారామె. ఆ తర్వాత వారి సులక్షణా థియేటర్‌లో ఆ చిత్రాన్ని చూపించారు కూడా. ఆ చిత్రం ఆ మహానటి నటజీవితంలో మరో కలికితురాయిగా అందరూ భావిస్తారనడంలో అతిశయోక్తి ఏమీ లేదు.

### చిత్రాల నామకరణం

శోభన్‌బాబు హీరోగా దీపక్ దర్శకత్వంలో జి. రాధాదేవిగుప్త, ఎ. కృష్ణయ్య నిర్మించే కవితా ఫిలిమ్స్ వర్ణ చిత్రానికి ''కార్తీక దీపం'' అని పేరు పెట్టారు.

బోయిన సుబ్బారావు దర్శకత్వంలో టి. త్రివిక్రమరావు నిర్మించే విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ వర్ణ చిత్రానికి ''బంగారు చెల్లెలు'' అని పేరు పెట్టారు. శోభన్‌బాబు, మురళీమోహన్ హీరోలు.

కృష్ణంరాజు, రంగనాథ్‌లతో ఎస్. డి. లాల్ దర్శకత్వంలో శ్రీకాంత్ సహతా నిర్మిస్తున్న శ్రీకాంత్ పిక్చర్స్ స్కోప్ కలర్ చిత్రానికి ''అందడు–ఆగడు'' అని నామకరణం చేశారు.

విజయలక్ష్మి మూవీ క్రియేషన్స్ పతాకంలో పి. వి సత్యనారాయణరావు నిర్మిస్తూ దర్శకత్వం వహించే చిత్రం పేరు ''శాంతి''. ఇందులో మురళీమోహన్, మోహన్‌బాబు ముఖ్య పాత్రధారులు.

### అంతులేని వింత కథలో ఎన్నికల ప్రచారం

మంగళగిరి అనర్గళంగా ఉపన్యాసం దంచేస్తున్నాడు: ''ఒకే డ్రస్సు ఎన్నాళ్ళని వేసుకుంటాం? ఒకే చెప్పులజత ఎన్నేళ్ళని తొడుక్కుంటాం? గుడ్డలు మార్చుకున్నట్టే జండాలు మార్చాలి. చెప్పులు మార్చుకున్నట్టే పార్టీలు మార్చాలి తప్పలేదు.''



'భావి పౌరులు'లో జయమాలిని



'వినాయక విజయం'లో వాణిశ్రీ

## మరో సీత కథలో ఫోటోగ్రాఫర్ ఆటకట్టు

స్టూడియోకొచ్చిన జానీని చూసి, ''రండి. ఫోటో దిగుతారా?'' అన్నాడు ఫోటోగ్రాఫర్.

''లేదు. మిమ్మల్ని దింపుతాను. ఇక్కడికి గోతిలో దిగినవాళ్ళుతప్ప ఫోటోలు దిగడానికి ఎవరూ రారనుకుంటాను?'' అన్నాడు జానీ.

''జోకేశారు. కూర్చోండి కూల్‌డ్రింక్ తెప్పిస్తాను.''

''తెప్పించి వుంచండి. నేనొచ్చిన విషయం తెలియగానే తాగెయ్యడానికి మీకు ఉపయోగ పడుతుంది. విషయానికొచ్చేస్తాను. ప్లేబాక్ ఆర్టిస్ట్ రాజా, అతని తండ్రి, చెల్లెలు వున్న ఫోటో మీదగ్గరుంది కదూ?''

''అది మీకెందుకు?''

''వ్యాపారానికి. లక్ష రూపాయలిస్తాను. ఆ నెగెటివ్ నాకు కావాలి.''

''ఇవ్వను. మీ వ్యాపారంకోసం నా వ్యాపారం చెడగొట్టుకునే వెర్రివాడ్నికాదు''

''ఇట్సాల్‌రైట్. రాజాతో నేనే ఈ రహస్యం చెప్పేసి, డబ్బు తీసుకుంటాను. అప్పుడు మీదగ్గరున్న నెగెటివ్ సూర్యగ్రహణం చూసుకోడానికి పనికొస్తుందంతే కూల్‌డ్రింక్ తాగి కూల్‌గా ఆలోచించండి.''

''ఆల్‌రైట్. డబ్బివ్వండి.''

''ఓ పని చేద్దాం. మీ కుర్రాడి చేతికి మీరు నెగెటివ్ కాపీలు, నేను డబ్బు అందిద్దాం. అతను మీ మనిషే కదా? మార్చి చేతికందిస్తాడు.''

''ఈ ఆలోచన బాగుంది,'' అంటూ ఫోటోగ్రాఫర్ నెగెటివ్ అందజేయగానే ఆ కుర్రాడు తుర్రుమన్నాడు. ''సుబ్బడూ!'' అని తెల్లబోతూ అరిచాడు ఫోటోగ్రాఫర్.

''మీ సుబ్బడూ - వాడి అబ్బడూ నాకు అమ్ముడైపోయారు, మిస్టర్. డబ్బుకు గడ్డికరిచే నీ శిష్యుడు కదా? వంద రూపాయలిచ్చి కొనేశాను. గుడ్‌బై ఫ్రెండ్!'' అంటూ జారుకున్నాడు జానీ.

''ఆ తర్వాత వాళ్ళిద్దరికీ ఫైట్ జరుగుతుంది,'' అన్నారు సులక్షణా థియేటర్‌లో ''మరో సీత కథ'' రషెస్ చూపించిన డైరెక్టర్ ఎస్. గోపాలకృష్ణ. కథ కూడా ఆయనే రాశారు. చిత్తూరు పి. ఎం. షణ్ముగం నిర్మించిన ఈ చిత్రంలో మురళీమోహన్, ప్రభ, కె విజయ, మోహన్‌బాబు, అల్లు రామలింగయ్య, మాడా, సిహెచ్. కృష్ణమూర్తి, మిక్కిలినేని, జయమాలినితోపాటు సంగీత దర్శకుడు చక్రవర్తి కూడా ఒక ప్రధాన భూమికను నిర్వహించారు.

## ఇల్లాలి ముచ్చట్లులో ముదిరిన వ్యవహారం

''ఆలస్యంగా ఇంటికొచ్చిన మొగుడు — పెళ్ళాంతో 'అసలు ఇవ్వాళ ఆలస్యం ఎందుకయిందంటే...' అనడంతోకూడా మొదలవుతాయి కొన్ని కథలు,'' అని పని మనిషితో అంటున్న భార్య సీత (ప్రభ)ను చూసి బిత్తరపోయిన రాము (మురళీమోహన్) ''అబ్బబ్బ! ఏమిటోనోయ్... మరీ డబుల్‌డ్యూటీ లెక్కువైపోయినయ్. ఒక్క నిమిషం రెస్ట్ వుండడంలేదంటే నమ్ము... జేబురుమాలిదిగో!'' అని రుమాలు తీస్తూ, కావాలనే ఓ ఉత్తరాన్ని కిందపడేసి, చూడనట్టుగా ఊరుకున్నాడు. ఆ కాగితాన్ని చూసిన సీత గబగబా వెళ్ళి ఆ కాగితంమీద కాలేసి నిలబడింది. అది ఓరకంటితో గమనించిన రాము ''ఏమిటోయ్, అలాగే నిలబడిపోయావ్. కూర్చో!'' అన్నాడు.

''పప్పుసుద్దలా కూర్చోవడంవల్లనే ఇందాకా వచ్చింది. ఇకనైనా నా కాళ్ళమీద నన్ను నిలబడనీయండి.''

''ఆఁ... అదిసరేగాని, నేనలా బజారు కెళ్ళొస్తాను. ఈలోగా విశ్రాంతితీసుకొని పెల్లబడు,'' అంటూ రాము బయలుదేరగానే సీత వంగి, కాలు కింద దాచిన కాగితం తీసుకోబోయింది. హఠాత్తుగా రాము తిరిగివస్తూ, ''ఆఁ... ఒకవేళ జయమ్మగారు నాకోసం ఫోన్‌చేస్తే, నేను వాళ్ళింటికే వెళ్ళానని చెప్పు,'' అంటూ వెళ్ళిపోయాడు.

సీతకు ఒళ్ళు మండిపోయింది. ''అలాగేలెండి. తప్పకుండా చెబుతాను. వాళ్ళింటికే వెళ్ళారని చెబుతాను. ఊఁ... సరాసరి పేరు చెప్పేంతవరకు వచ్చిందన్నమాట వ్యవహారం! అవున్లెండి — తెగించినవారికి...'' అని గొణుక్కుంటూ ఆ ఉత్తరం చదవడానికి ఆతృతగా వెళ్ళింది పక్క గదిలోకి.

ఉదయలక్ష్మి ఎంటర్‌ప్రైజెస్ ''ఇల్లాలి ముచ్చట్లు'' చిత్రంలో ప్రభాకరరెడ్డి, కాంతారావు, చంద్రకళ, నిర్మల, పుష్పకుమారి ఇతర పాత్రధారులు. ఎం. ఎస్. కోటారెడ్డి దర్శకుడు.

## భావిపౌరులు

కిరణ్ చిత్ర వారి ''భావిపౌరులు'' చిత్రాన్ని పి. ఎం. వెంకటేశ్వరరావు దర్శకత్వంలో కిరణ్‌భాషా నిర్మిస్తున్నారు. కడప, రాయచూర్ ప్రాంతాలలో జనవరి 8 వరకు జరిగిన షూటింగ్‌తో చిత్రం దాదాపు పూర్తయినట్లే. జయమాలిని, లక్ష్మీచిత్ర, ఫణి, సత్యకళ, రంజిత్, రవీంద్రబాబు వగైరా పాత కొత్త నటీనటులున్న ఈ చిత్రానికి పినిసెట్టి రచయిత. పి. ఎస్. రాజా సంగీత దర్శకుడు. పి. రంగన్న ఛాయాగ్రాహకుడు.

'ప్రెసిడెంట్ పేరమ్మ'లో నూతన్‌ప్రసాద్, కవిత



## సంఘం చెక్కిన శిల్పాలులో రావుబాలసరస్వతీదేవి గానం

చాలాకాలం తర్వాత మధుర గాయని రావుబాలసరస్వతీదేవి సినిమాకు పాడడం ఆమె అభిమానులకు మహదానందకరమైన వార్త. శ్రీ విజయకృష్ణ మూవీస్ వర్ణ చిత్రానికి 'పోయిరావేఅమ్మ పోయిరావమ్మ – అత్తవారింటికి అపరంజిబొమ్మ' అనే పాటను జనవరి 16వ విజయాగార్డెన్స్ రికార్డింగ్ థియేటర్‌లో పాడారు "గోల్డన్ వాయిస్," అన్నారు సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు "ఆ పాటను ఆమెచేతే పాడిస్తే మరింత రక్తికడుతుందని భావించాం కోరగానే అంగీకరించారు చూశారా! ఇన్నేళ్ళ తర్వాత కూడా ఆ మధురమైన గాత్రంలో మార్పేమీ లేకపోవడం భగవంతుడు ఆమె కిచ్చిన వరం," అన్నారు "సంఘం చెక్కిన శిల్పాలు" చిత్రానికి దర్శకత్వం వహించే విజయనిర్మల ఆమెతోపాటు చంద్రమోహన్, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, రమాప్రభ, సూర్యకాంతం మున్నగువారు పాత్రధారులు తోటకూర ఆశాలత నవలకు అప్పలాచార్య మాటలు రాశారు సి నారాయణరెడ్డి కవి పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, ఆదుర్తి హరనాథ్ కూర్పు ఇతర హంగులు ఎన్ రఘునాథ్ నిర్మాత

## తమిళ హిట్ చిత్రం తెలుగులో

"కిషక్కుం పోగుం రైల్" అనే చిత్రం తమిళనాడులో సంచలనాన్ని సృష్టించింది దానిని తెలుగులో త్రివేణి ఆర్ట్ కంబైన్స్ పతాకంలో తీస్తున్నట్టు నిర్మాత పేరరాజు తెలియజేశారు బాపు దర్శకుడు ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం సంగీతమిస్తారు ఎం వి ఎల్ సంభాషణలకర్త ఇషన్ ఆర్య ఛాయాగ్రాహకుడు కొందరు కొత్త నటీనటులు పాల్గొనే ఈ చిత్రం షూటింగ్ ఫిబ్రవరి 28న ప్రారంభమౌతుంది ఔట్‌డోర్‌లో ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుంది

# * జి. వి. జి. పేజీ *

## "కుక్క కాటుకు చెప్పుదెబ్బ"లో సుందరరామయ్య సందేహం

"ఓసారి పార్వతిని నాతో పంపిస్తే, మాట్లాడాల్సిన పనుంది," అన్నాడు సత్యం (నారాయణరావు)

కుటుంబరావు (హేమసుందర్) 'ఏమిటీ!" అంటూ నివ్వెరపోయాడు

అక్కడే ఉన్న సుందరరామయ్య (వంకాయల) "పెళ్ళి కాకుండానే షికార్లేమిటోయ్? షాపింగ్‌కు వెళ్దామనా?" అన్నాడు

కుటుంబరావు వెంటనే తన కూతురు పార్వతి (మాధవి)ని పిలిచాడు ఆమెతో, సత్యం నిష్క్రమిస్తుంటే, "చూశారా, సుందరరామయ్య గారూ! వాళ్ళిద్దర్నీ చూస్తుంటే చిలకా గోరింకల్లా లేరూ?" అన్నాడు

సుందరరామయ్య బుర్ర గోక్కుంటూ, "ఈడూజోడైనవాళ్ళను చూసినప్పుడు చిలకా గోరింకలంటారు కాని, నిజానికి చిలుకలు వేరు, గోరింకలు వేరూనయ్యా! మరి ఈ పోలికెలా వచ్చిందోగాని,' అన్న సందేహంలో పడ్డాడు

ఈరంకి శర్మ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వలసాని గోపి నిర్మాతగా చేగొండి హరిబాబు సమర్పించే "కుక్కకాటుకు చెప్పుదెబ్బ' చిత్రం త్వరలో విడుదలవబోతోంది చిరంజీవి, లక్ష్మీకాంత్, పల్లవి, పి ఎల్ నారాయణ, రాళ్ళపల్లి, జానకి, విజయలక్ష్మి, జయసుజాత ఇతర నటవర్గం సి ఎస్ రావ్ మాటలు, ఆత్రేయ పాటలు రాశారు విశ్వనాథన్ సంగీత దర్శకుడు ఛాయ, కూర్పు, నిర్మాణం, సహాయ దర్శకత్వాన్ని ఆర్ రఘునాథరెడ్డి, డి వెంకటరత్నం, జి సత్యరాజు, గమిడి కనకేశ్వరరావు నిర్వహించారు



'కెప్టెన్ కృష్ణ'లో కృష్ణ, శ్రీప్రియ

## "వియ్యాలవారి కయ్యాలు"లో పెళ్ళికొడుకుల ఫాక్టరీ!

హరిప్రసాదరావు, సాంబయ్య సిటీలోకొచ్చారు హరిప్రసాదరావు జేబులు తడుముకొని, "కొంప మునిగిందిరా, సాంబా! అడ్రసు కాగితం ఎగిరి పోయింది!" అని గావుకేకెట్టాడు

"తిరిగి ఇంటికెళ్ళి తెద్దాం, అయ్యగారూ!"

"ఇంటికెళ్తే చంపేస్తుందిరా మీ అమ్మగారు ఇప్పుడేం చెయ్యాలి?"

"పోన్లెండయ్యగారూ! పెళ్ళికొడుకుల ఫాక్టరీకి వెళ్ళి ప్రయత్నం చేద్దాం"

"పౌడరు డబ్బాలు తయారు చేసినట్లు – పెళ్ళికొడుకుల్ని మిషన్లోంచి తయారుచేసే ఫాక్టరీలున్నాయేమిటి?" కుతూహలంతో అడిగాడు హరిప్రసాదరావు (నాగభూషణం)

'ఉన్నాయి, అయ్యగారూ! ఆ పెళ్ళికొడుకుల ఫాక్టరీలను యూనివర్సిటీలంటారు ప్రతి ఏటా కొన్ని వేలమంది పెళ్ళికొడుకులు తయారై, గేటు దాటి మార్కెట్లో పడతారు పదండి, యూనివర్సిటీకెళ్ళిచూద్దాం,' అన్నాడుసాంబయ్య(మాడా)

కృష్ణ, జయప్రద ప్రధాన భూమికలు నిర్వహించే విష్ణుప్రియా ఆర్ట్ పిక్చర్స్ "వియ్యాలవారి కయ్యాలు" స్కోప్ కలర్ చిత్రం ఫిబ్రవరి విడుదల కట్టా సుబ్బారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి, మాలి రంగయ్య నిర్మించారు

## కొత్త దర్శకుడు

ఆదుర్తి, చాణక్య, వి మధుసూదనరావు, బి ఎస్ నారాయణ ప్రభృతులవద్ద సహకార దర్శకుడుగా పని చేసిన రామారి శ్రీనివాసరావు ప్రేమ్‌కృష్ణ మూవీస్ "మా ఇంటి జ్యోతి" చిత్రానికి దర్శకుడు శారద, శ్రీధర్, గిరిబాబు, నరసింహరాజు, రమాప్రభ, మమత, బేబీ గౌరి, రాజ్‌బాబు పాత్రధారులు తొలి షెడ్యూల్ ఫిబ్రవరి 10వ తేదీ వరకు శ్రీ సారధి స్టూడియోలో జరుగుతుంది రాజశ్రీ రచయిత పెండ్యాల స్వరకల్పనలో ఆత్రేయ, ఆరుద్ర గీతాలు రాశారు ఛాయ, శిల్పం, కూర్పులను సుఖదేవ్, వి కృష్ణమూర్తి, అంకిరెడ్డి నిర్వహిస్తున్నారు ప్రేమ్‌దాస్, ఎస్ వి జి కృష్ణ నిర్మాతలు

## తెలుగు చిత్రాలకు తమిళ దర్శకుడు

"పదునారు వయదినిలే (పదహారేళ్ళ వయసు), కిషక్కుం పోగుంరైల్" చిత్రాల దర్శకుడుగా తమిళనాడులో యువతరాన్ని విశేషంగా ఆకర్షించిన భారతిరాజా తెలుగు చిత్రసీమకూ పరిచయం గావింపబడుతున్నాడు ఎన్ టి ఆర్ తో శ్రీ పద్మావతీ పిక్చర్స్ పతాకంలో ఉప్పలపాటి సూర్యనారాయణబాబు నిర్మించే చిత్రమొకటి రెండోవది కె ఎస్ ఆర్ క్రియేషన్స్ పతాకంలో బోయపాటి సీతారామయ్య రూపొందించే "ఎర్రగులాబీలు" ఇందులో కమలహాసన్, శ్రీదేవి ముఖ్య జంట జంధ్యాల మాటలు, ఇళయరాజా సంగీతంలో ఆత్రేయ, వేటూరి పాటలు రాశారు పి ఎస్ నివాస్ ఛాయాగ్రాహకుడు ☼

నీ భాగ్యంమీద మాకెంతో గురి. అందుచేత నువ్వే మొదట నాటాలి," అంది విశాలాక్షి.

భూషణం, సుకుమార్ అదేమాటన్నారు.

వినోద్ నవ్వుతూ, 'సరే అలాగే కానివ్వండి,' అని మొదట కాలీఫ్లవర్ నారుని తనే మొదటి వరుసలో నాటేడు. అందరూ తలో వరుస తీసుకుని నారుని నాటడం మొదలెట్టేరు. ఆఖరుకి

# జీవిత మాధుర్యం

[24 వ పేజీ తరువాయి]

ఆ ఉత్సాహం పంచుకోడానికి పనిమనిషి రాజమ్మ, పనివాడు రామయ్య కూడ పనిలోకి దిగేరు. ఎవ్వరూ ఒక్క మొక్కను నాటడంతో ఊరుకోలేదు. అలా వరుసలన్ని నాటడం చేసేరు. పన్నెండుగంటల ముప్ఫై నిముషాల వరకు ఆ పని చేస్తునేవున్నార మళ్ళీ భోజనాలయేక ఆ పదకొండుమంది ఆ ప మొదలెట్టి సాయంత్రం అయిదున్నరక ఆ నాలుగురకాల మొక్కల్ని నాటడ పూర్తిచేసేరు.

వినోద్‌కి చాలా ఆశ్చర్యంగావుంది. తనేన ఆ పని చేస్తున్నది. తనని ఆ స్థితిలో తన తల్లి

చూస్తే ఎంత నిర్ఘాంతపోతుందో తలచుకుంటేనే వినోద్‌కి నవ్వు వస్తూంది. తన బంధువర్గం ఎవరు తనని ఆ స్థితిలో చూచినా తనకు తప్పక పిచ్చిపట్టిందనుకుంటారు — గాని తనకు లావణ్య సరసను పని చేయడంలో ఏదో అనిర్వచనీయమైన ఉల్లాసం కల్గుతూంది.

లావణ్యవైపు చూచేడు. లావణ్య ఎంతో శ్రద్ధగా తన పనిలో నిమగ్నమైంది. ఆమె లావణ్యాన్ని చూస్తుంటే — 'ఎంత చక్కని అమ్మాయి !' అని మనస్సులో అనుకోలేకుండా వుండలేకపోతున్నాడు వినోద్. లావణ్యవైపు వినోద్ అలా చూస్తుండడం విశాలాక్షి గమనించింది. తనలో చిన్నగా నవ్వుకుంది.

ఆ కుటుంబంయొక్క ఆశల్ని మొక్కలుగా ఆ భూమిలో నాటుతున్నారు. వారి ఆశలు ఎలా ఫలిస్తాయో చూడాలి అనుకున్నాడు వినోద్.

ఆ రెండెకరాల స్థలాన్ని నాలుగు మడులుగా చేసేరు. ఆ నాల్గింటిలోను కాలీఫ్లవరు, కాబేజి, నూలుకోలు, టమాటా వేరువేరుగా నాటేరు. ఆ చిన్న మొక్కల్ని రెండేసి చొప్పున రెండు అడుగుల దూరంలో వరుసగా నాటేరు. భీమయ్య నాటడం పూర్తయేక నీళ్ళు తోడి బాల్చీలలో తెచ్చి చేతితో నీళ్ళను జల్లేడు. అందరికి అదొక కొత్త అనుభవం, కొత్త ఉత్సాహం.

పదిరోజులయేసరికి అన్ని మొక్కలూ నాటుకుని చిగురించేయి. ఆ పచ్చని స్థలం చూచేసరికి అందరికి ఆనందం కల్గింది.

భూషణం వనజను, గోపీని స్కూలులో చేర్పించేడు. అందరూ ఆ చిరుగుల బట్టల్ని వదిలేసేరు. మంచి బట్టల్ని కట్టుకోడం మొదలెట్టేరు. ఇంటికి రెండు వార పత్రికలు, రెండు మాస పత్రికలు, ఒక సినీమా పత్రిక, ఒక ఇంగ్లీషు వార్తాపత్రిక, ఒక తెలుగు వార్తాపత్రిక న్యూసు ఏజెంటు కుర్రాడు తెచ్చిపడేస్తున్నాడు. అందరికి వాటివల్ల కొంత కాలక్షేపం అవుతూంది.

మరో వారం రోజులు గడిచేయి. ఓ సూటుకేసు పట్టుకుని ఓనాడు ఓ ఆసామి ఆనంద నిలయంకు వచ్చేడు.

"వినోద్‌బాబుగారున్నారండి ?" — లావణ్యను ప్రశ్నించేడు.

"ఆ. మేడమీదున్నారు - పిలుస్తాను. మీరెవ్వరు ?"

"నా పేరు మాధవరావండి. అయ్యగారు నన్ను పిలిపించేరు. నేను విజయవాడనుండి వచ్చేను."

"ఇలా వచ్చి కూర్చోండి."

లావణ్య అతడికి హాలులోని ఒక కుర్చీ చూపించి, వినోద్‌ని పిలవడానికి హాలులో ఎవ్వరూ అగుపించకపోయేసరికి తనే మేడమీదకు వెళ్ళి వినోద్ గదివద్దకు వెళ్ళింది. వినోద్ టేబిలుమీద కాగితాలు పరుచుకుని ఏవో ప్లానులు గీస్తున్నాడు.

"వినోద్‌గారూ ! మీకోసం ఎవరో మాధవరావు గారట విజయవాడనుంచి వచ్చేరు," అని లావణ్య చెప్పింది.

# జీవిత మాధుర్యం

లావణ్య ఆ గులాబిరంగు చీరలో చాలా అందంగా కనిపిస్తూంది. వినోద్ ఆమె చెప్పిన మాటల్ని అంతగా వినిపించుకోలేదు. ఆమె సోయగాన్నే చూస్తున్నాడు.

"మీరు క్రిందకు వస్తారా లేక అతన్నే మేడమీదకు పంపమన్నారా ? చెప్పండి," అని గట్టిగా అడిగేసరికి వినోద్ స్వప్నం చెదరి —

"ఏమన్నారు ?" అని అడిగేడు.

లావణ్య కాస్త చిరాకుతో "నేనేమి అనలేదుగాని తమరు ఇలా రండి," అంది. వినోద్ ఎంతో ఉత్సాహంతో లేచివచ్చేడు. లావణ్య సన్నగా నవ్వుకుంది. అతడు వెంట వస్తుంటే మేడ దిగి క్రింద హాలులోనికి వచ్చి మాధవరావుని చూపించింది.

"హలో మాధవరావు ! ఎప్పుడు రావడం?"

"ఇప్పుడే సార్ — మొన్ననే మీ ఉత్తరం అందింది."

"సరే ఇలారా మాట్లాడుదాం," అని మాధవరావుని తీసుకుని తోటలోనికి పోయేడు.

ఈ సంభాషణ లావణ్య వింది. కాస్త ఆశ్చర్యపోయింది. వినోద్ మాధవరావుని పూర్తిగా ఎందుకు మాట్లాడనివ్వలేదు ? మంచి బట్టలు కట్టుకుని పెద్దమనిషిలా వున్న మాధవరావుని, వినోద్ 'నువ్వు' అంటున్నాడు మాధవరావు తిరిగి 'సార్' అంటున్నాడు. వీళ్ళిద్దరికివున్న సంబంధ మేమిటో ! లావణ్యకు ఏమీ బోధపడలేదు. వినోద్ విచిత్రమైన వ్యక్తి అనుకుంది.

మాధవరావును తోటలోకి తీసుకునివెళ్ళి కుడివైపునున్న స్థలాన్ని చూపెట్టేడు వినోదమూర్తి.

"మాధవరావు — ఈ పెద్ద స్థలంలో ఏదైన ఫౌండ్రీ పెట్టాలనుంది. ఈ కుటుంబం చాలా గౌరవమైంది. ఒకప్పుడు రాజుల్లా బ్రతికి ఇప్పుడు చెడినవారయ్యేరు. కాని ఈ వూరివారెవ్వరు ఈ కుటుంబానికి సహాయం చెయ్యలేదు. నేను వీళ్ళకు చేయూత నివ్వదల్చేను. వ్యాపారంలో అతనికి కలసిరాలేదు. అందుకే మరో వృత్తిలో వారిని పెట్టదల్చేను. నా ఈ ఫౌండ్రీ అయిడియా ఎలాగుందంటావు ?"

మాధవరావు ఆ స్థలాన్నంతా పరికించి చూసేడు.

"మీ ఉద్దేశం బాగానేవుంది సార్. ఫౌండ్రీలో ఏమేమి తయారుచేయదల్చేరు."

"ఫాబ్రికేషన్స్ ఏవైనసరే చేద్దాం. ఇండ్లకు కావల్సిన గేట్లు, జాలీలు, కిటికీలు, ఇనుపపోత పొయ్యిలు. టెలిగ్రాఫ్స్ డిపార్ట్‌మెంటుకి కావల్సిన పోల్‌ప్లేట్లు, సాడిల్సు, స్టాకులు, యుబేకులు, ఏంకర్లు — తరువాత ఆర్డర్లను బట్టి వివిధమైనటువంటి పోతపనులు చేద్దాం. ముందుగా విశాఖపట్నం నుండి హిందుస్థాన్ స్టీల్స్ యార్డు నుండి మనకు దుక్కఇనుము, కడ్డీలు, ఏంగిల్సు సరఫరా అయేటట్లు చూడాలి. దీన్నో అనుబంధ సంస్థగా తీసుకుని మనకు విజయవాడకు వచ్చిన ఆర్డర్లకు యిక్కడ కొంత సామగ్రిని తయారుచేయించవచ్చును — ఏమంటావు ?"

"మీ ఉద్దేశం బాగానేవుంది సార్. ఈ స్థలం ఫౌండ్రీకి సరిపోతుంది. మరి ఫౌండ్రీ మెషినరీని ఏర్పాటేమైనా చేయించేరా ?"

"చూడు మాధవరావు — ఇక్కడ షెడ్డులను కట్టించడం, ఫౌండ్రీకి కావల్సిన సామగ్రిని తెప్పించడం, మెషినరీ తెచ్చి నెలకొల్పడం ఇదంతా నీ బాధ్యత. విజయవాడ నుంచి కొంతమంది పనివారిని ఇక్కడకు రప్పించి ఇక్కడ కొంతమంది యువకులకు శిక్షణ ఇప్పించాలి. మన విజయవాడ ఫౌండ్రీ ఫోర్‌మన్ ముసలయ్యను రమ్మనమను. ఇక్కడ ఆరునెలలుండి ఈ ఫౌండ్రీ బాగా సాగిపోతుంటే, నువ్వు, ముసలయ్య తిరిగి విజయవాడ వెళ్ళిపోవచ్చు నేను మన విజయవాడ ఫౌండ్రి మేనేజరు విశ్వనాథంకు ఈ విషయమై ఉత్తరం వ్రాస్తాలే. ఈ కుటుంబంకోసం నేనీ పని చేస్తున్నానన్నది మనిద్దరిమధ్య వుండవల్సిన విషయం. మన ఫౌండ్రీలకు అనుబంధ సంస్థగా ఇక్కడో చిన్న ఫౌండ్రీ నెలకొల్పుతున్నామంటే చాలు. డబ్బుకు వెనుదీయకు. కావల్సిన డబ్బుకు చెక్కు వ్రాసిస్తా. నేనెంత ఖర్చుచేస్తున్నది ఎవ్వరికి ముఖ్యంగా ఈ కుటుంబ సభ్యులకు తెలియనివ్వకు. ఎన్ని ఓవెన్సు కావాలో ఇద్దరం రేపు ఆలోచిద్దాం — ఏమంటావు మాధవరావు ?"

"ఏమిటిసార్ నాకు మీరింతగా చెప్పాలా. నా కుటుంబానికి మీరెంత సహాయపడ్డారో నేనీ జన్మకు మరచిపోగలనా ? మీకోసం నేను ప్రాణాలివ్వడానికైనా సంసిద్ధుణ్ణే. మీరే చింత పెట్టుకోకండి. నామీద వదిలేయండి — నెల్లాళ్ళయేసరికి ఇక్కడ ఫౌండ్రీని నిలబెడ్తా. మీరు ఈవిధంగా మరో కుటుంబానికి సహాయ పడుతున్నందుకు నేనెంతో సంతోషిస్తున్నా. మీ సహృదయత నాకు తెలీందా బాబూ. మరి నా బస ఎక్కడ పెట్టమంటారు ?"

"ఈ రోడ్డు చివర్న టౌను మొదట్లో గెయిటీహోటలొకటి వుంది. అందులో నెలవారిపై ఓ గదిని తీసుకుని, అక్కడే భోజనం ఏర్పాటు చేసుకో. అక్కడ భోజనం, ఫలహారం బాగుంటుందని విన్నా. ఇవాళకి రెస్టు తీసుకుని ఈ విషయమై కాస్త ఆలోచించు. రేపు మనిద్దరం ఇక్కడే కలసి వివరంగా ప్లాన్సు గీసుకుని మిగతా విషయాలన్నీ నిర్ణయించుకుందాం. ఆవిధంగా మెషినరీకి ఆర్డరివ్వొచ్చు."

"అలాగే సార్."

మాధవరావు ఇంట్లోకి వచ్చి తన పెట్టెను తీసుకుని హోటలుకి పోయేడు. వినోద్‌మూర్తి మేడమీదకు తన గదిలోకి వెళ్ళేడు. తెల్లకాగితాలు తీసుకుని ఆ ఫౌండ్రీ ప్లానులు గీయడం మొదలెట్టేడు. సరిగ్గా మధ్యాహ్నం నాల్గు గంటలకు వనజ వచ్చి పిలవగా ఆ కాగితాలను తీసుకుని మేడ దిగి హాలులోనికి వచ్చేడు.

ఫలహారం కాఫీ అయేక వినోద్ అందరి సమక్షంలో తను వేసిన పథకాన్ని వివరించేడు.

[ఇంకా వుంది]

# బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్

# 3 తరాల వారికి అదే కమ్మని రుచి



గ్రీన్ లేబిల్ : అనేక సం॥ల గా బామ్మగారు దాన్ని ఉపయోగిస్తున్న విధం



గ్రీన్ లేబిల్ : అమ్మ దాన్ని ఉపయోగిస్తున్న విధం



అదే గ్రీన్ లేబిల్ : మీరు మెచ్చుకొనే విధం మరియు మీరు ఉపయోగించే విధం

మూడు తరాల వారికి అభిమాని కావడంలో ఆశ్చర్య పడనవసరం లేదు. మరియు ఈ రోజు అందుకే అధికంగా అమ్ముడవుతుంది




**ఎల్లప్పుడూ శ్రేష్ఠమైనది, స్ట్రాంగైనది**

OBM-5709 A/1 TEL




ఎన్. ఆర్. బి. బరంపురం

మీరు ఆడవాళ్లను పొగుడుతూ త్యాగమూర్తులు, పరాయి మగవాడి పక్క కన్నెత్తి చూడరు అంటూ గొప్పలు చెప్తారు. . . . .

పొరబడుతున్నావు రమేష్‌బాబూ, నేనెక్కడైనా ఇలా రాస్తే — చూపించు. అయినా కుర్రాడివి యిలాంటివి మీ అమ్మని అడిగిచూడాలి ముందు. అక్కడ సరైన సమాధానం రాకపోతే, "మేటి ఆడ దాని మీదఅభిప్రాయాలు యిలా దొర్లించేయకుండా నిజానిజాలు తెలుసుకునే ప్రయత్నాలు చేయాలి, ఆ తరువాతనే యిలాంటి పబ్లిక్ ఇన్‌డిక్ట్‌మెంటుకి దిగాలి తెలిసిందా ?!

ఎన్. ఎస్. ఎ. భువనగిరి

దేమునికంటే ముందు ఏముంది?

శూన్యంకూడా లేదని.

దేవుడు ఎక్కడ వున్నాడు?

తలిచేవారి మనసుల్లో.

దేవుడు ఏం చేస్తున్నాడు.?

మానవుని తాపత్రయం, ఆత్రం చూసి నవ్వుకుంటూ వుండి వుంటాడు.

సి. ఎస్; కె; ఆర్ జె; జె చిత్తూరు

మాటలకు చేతలకు పొంతనలేని లోకం ఎప్పుడు మారుతుంది?

మారుతుంది అనుకోడం నో ఎండమావి నేటి అమ్మాయిలూ, మారీమారనట్టు కన్పిస్తూ మారకుండానే కాలక్షేపం అయిపోతూ వుంటుంది. తన అభిప్రాయాలను, ఆశయాలను చంపుకుని జీవచ్ఛవంలాగా పడివుంటున్న యీతరం యువతులకి మీ సలహా ?

యీతరం యువతులేం అలా లేరని మొన్నీ మధ్య విజయవాడ విద్యార్థినులు నిరూపించలేదా?! చదువు—దానితోపాటు ఆత్మస్థయిర్యం వాటికి జతగా ఆర్థిక స్వాతంత్ర్యం సాధించుకోకల్గితే— అమ్మాయిలు ఆశయాలూ అభిప్రాయాలూ చంపుకోనూ అక్కరలేదు— వాటికోసం సర్వం వదులుకుని మొండి ఘటాల్లాగా తయారు కావక్కరలేదు.

జె. ఆర్. పెండేకల్

మీరు మీ ప్రశ్నావళిలో అన్నిరకాల ప్రశ్నలకి జవాబులిస్తున్నారు. అంచేత ఏ ప్రశ్న అడగాలో అర్థం కావడంలేదు.

పాపం ! నీ కష్టం చిట్టితల్లీ — నేను అప్పుడప్పుడు అనుకుంటూ వుంటాను — నో వారం ప్రేమ ప్రశ్నలు, నో వారం ధనం ప్రశ్నలు, నో వారం ఆడమగా ఆధిక్యత ప్రశ్నలు, నో వారం సినీప్రశ్నలు నో వారం నీతిప్రశ్నలు—గా తీసుకుని జవాబులిద్దామా అని!

ఎస్ బి. ఎన్. బొంబాయి

మందిరములోనికి వెళ్లేప్పుడు పాదరక్షలు బయటవిడిచి వెడతారెందుకు ?

దైవసన్నిధి శుచిగా వుంటుంది అని కాబోలు.

వెంకట్. ఉరవకొండ

బాంధవ్యం కంటే స్నేహమే గొప్ప. అలాంటి స్నేహం నిలబడాలంటే ఏం చేయాలి అక్కయ్యా?

బాంధవ్యం కలుపుకోకుండా వుండడమే తమ్ముడూ.

వి ఎస్ వి చీరాల

ఆంధ్రా ప్రాంతానికే ప్రేమపరిమితం గాదని గమనించ కోరుతున్నాను.

పోనీ ప్రేమపిచ్చి పరిమితమా? ప్రేమ ఎవరికైనా సహజమే. కాని దాన్ని గురించిన అవాస్తవ ధోరణికి మన వాళ్లది—పైచేయి!

కె. డి. ఎ. కె. మంగళగిరి

మీ నవలల్లో ఎక్కువగా హీరోలు జమీందారు పుత్రులు, హీరోయిన్‌లు టీచరో, పేదరాలో (కరుణకథ, చీకటిదారి, తిరుగుబాటు) ఉంటుంది. ఎందుకు? మీ నవల ఆశకు సంకెళ్లు నాకు చాలా ఇష్టం.

గొప్పమగవాళ్లకి బాధ్యతల పట్ల నిర్లక్ష్యంతో కూడిన దృక్పథం వుండి — దానిని మార్చుకోడానికి ఇబ్బందిపడతారు. యిక టీచర్లూ, పేదరాళ్లూ నాకు తెలిసిన ఆడపిల్లలు. సంఘర్షణ — ఎప్పుడూ విభిన్న తత్వాల మధ్య రాణించినట్టు ఒకేక్లాసువ్యక్తులలోరాణించదేమోనని నా అనుమానం.

కబీర్ రేణిగుంట

అరిచేగాడిద వచ్చి మేసేగాడిదను చెరిచినట్టు, మీ జవాబులతో మమ్ములను రెచ్చగొడుతున్నారు.

అస్తమానూ మేతే అయితే బుర్రలేని గాడిదవై పోతావని భయం కబీరూ, అందుకని దృష్టిమళ్లిస్తూ వుంటాను.

ప్రసాద్ సూళ్ళూరు పేట

నేను దేవుడికి దండం పెట్టను. నాలో నాకు నమ్మకం ఎక్కువ. దేవుడికి దండం పెట్టకపోతే ఏం?

ఏంలేదు! దేవుడెప్పుడైనా దండం పెట్టమని మిమ్మల్ని అడిగాడా ఏం? మీలో అంత గట్టి నమ్మకం మీకు వుంటే యీ ఏం? అన్న ప్రశ్నకి తావేవుండదు కద !




రామనాథం శెట్టి మంచి లౌకికుడు. చిరుప్రాయంలో జీవితానికి తగిలిన దెబ్బలను మెట్లుగా మలచి, అంచెలవారీగా అనుభవపు కొండల్ని అధిగమించి, శిఖర గోపురాన్ని అందుకున్న సమర్థుడు. విద్య తక్కువన్న లోపం అతడు సాధించిన అభి వృద్ధిని ఆపలేక పోయింది. కారణం - అతడు పుస్తకాలకు బదులు మనుషుల్ని చదివిన వ్యక్తి. ఇంట్లోని ముసలి తల్లినీ- రెక్కలింకా రాని ముగ్గురు తమ్ముళ్ళనూ కాపాడేందుకు ప్రారంభించిన చిన్న కాయ గూరల వ్యాపారాన్ని జీవనదివంటి దీర్ఘ మైనదిగా- ప్రయోజనకరమైనదిగా మార్చి, నేనాడు ఓ మోతుబరి వ్యాపారిగా కీర్తిని సముపార్జించాడు. అతడి కుటుంబం, వ్యాపార కేంద్రం వెంకటగిరిలో ఉన్నా- వ్యాపారం దృష్ట్యా చంద్రపాలెం వచ్చికొన్ని రోజులు గడుపుతుంటాడు వ్యాపారంభారీగా పెరిగిన మరి కొన్నేళ్ళకు, అతడు చంద్ర పాలెంలోనే ఒక చిద్దె ఇంటిని కొన్నాడు. అంతకు ముందు అతడు చంద్రపాలెం వచ్చి లావాదేవీలు ముగించుకొని, లారీలలో సరకు ఎక్కించుకొని వెళ్ళడానికి వారం రోజులు కంటే ఎక్కువ పట్టేది కాదు. ఇప్పుడు చంద్రపాలెం వచ్చినప్పుడల్లా రెండు వారా లయినా ఉండి వెళ్ళుతున్నాడు.

రామనాథంశెట్టికి, చాలామంది అనుభవ శాలురైన వ్యాపారస్థులకున్న కఠినత్వం, నువిశితత్వం లోపలఉన్నా- ప్రతి విషయం లోనూ వాటినతడు ప్రదర్శించడు జీవితపు అట్టడుగునుండి వచ్చిన వాడు కావటాన, కనికరం సముద్రమంత కాక పోయినా- కొద్దీ గొప్పో అతడి హృదయంలో చోటు వేసుకుంది ఎప్పుడైనా స్కూలు బిల్డింగు మరమ్మతు కోసమని- గుడి పున రుద్ధరణ కోసమని పురప్రముఖులు అతడి ఇంటివాకిట ముందు నిలుచుంటే- అతడు ముఖం మాడ్చుకోడు సరికదా, నవ్వుతూ ఎదురువెళ్ళి, తన సహజధోరణిలో, "ఏం కావాలి అబ్బాయిలూ ?" అని అడుగుతాడు. అదే సమయాన, శెట్టిని మెతకవాడిగా పరిగణించి బుగ్గలు పొగడిసి బాగాలె వడ్డించుకోవాలని ప్రయత్నించేవారిని అతడు ఆమడదూరాన ఉంచగలడు తను ముళ్ళున్న మొగలి పట్లనని నిరూపించగలడు.

* * *

రామనాథం శెట్టి చంద్రపాలెం బస్టాం డులో దిగి, నేరుగా బజారు వీధి చివరన ఉన్న దుకాణంలోకి జొరబడ్డాడు. దుకాణం యజమాని రామప్ప శెట్టిని అల్లంత దూరాన చూచి లేచి నిలుచున్నాడు. "మీరా శెట్టిగారూ! మీరు వచ్చేదారిలోనే కొత్తగా ఉడిపీ భవన్ కట్టారట. అక్కడికి వెళ్తా రనుకున్నాను." చిరుహాసంతో అన్నాడు రామప్ప "ఊరుకోరా మొద్దు ముఖమా! ఏ దుకాణానికి వెళ్ళాలో- ఏ దుకాణానికి వెళ్ళ కూడదో నాకు తెలియద్రా ? ఇంత కూ చిన్నికనుంచి ఏ దుకాణంలోకి జొరబడ కూడదంటావు. అంతేనా?" అరుస్తున్నాడో నవ్వుతున్నాడో తెలియనంత గట్టిగా అన్నాడు శెట్టి.

"ఎకసెక్కాల కన్నాను గాని మీ గురించి నాకు తెలియదా ? ఈ దుకాణం మీ వంటిం టితో సమానం. పెసరట్లు వేయమంటారా?

"అడగడం దేనికి రామప్పా ! వేడివేడిగా ఉండాలి. చప్పరిస్తే కరిగిపోవాలి మరి" అని శెట్టి లోపలకు వెళ్ళి కూర్చున్నాడు. అతడొకమారు చుట్టూ పరకాయించి చూశాడు.

"అరె, నువ్వట్రా పాపయ్యా! ఇన్నాళ్ళూ ఎక్కడికి వెళ్ళావు ?" తింటున్న వాడల్లా చటుక్కున లేచి నిలుచున్నాడు పాపయ్య.

"చిత్తం. మా ఊరు కెళ్ళొచ్చానండి."

"ఎందుకో తెలుసుకోవచ్చా ?"

"పిల్లను చూపివచ్చాను." పాపయ్య సిగ్గుపడి పోయాడు.

"అదా సంగతి. పెళ్ళికి పిలవడం మరిచి

పోకురోయ్!'' అని మరోవైపు తల తిప్పి చూసి, ''ఒరే రామిగా! నువ్వెప్పుడురా ఊడిపడ్డావు! పొరుగూరులో పళ్ల వ్యాపారమని వెళ్ళావుగా!'' అని అదే అరుపు వంటి పిలుపుతో పలకరించాడు శెట్టి.

''చిత్తం బాబయ్యా! మీబోటివారి దయ వలన వ్యాపారం పర్వాలేదు. పనుండి వచ్చాను''

''భలేగుడ్! భలేగుడ్! అవసరం ఉంటే, నా దగ్గిరకు రావడం మరిచిపోకు'' అని అతడలా తెలిసిన వారినందరినీ పలకరించేటప్పుడు, అతడి చూపులు అప్రయత్నంగా టీ కొనుక్కోడానికి గ్లాసు పట్టుకొని నిలుచున్న ఒక స్త్రీ పైన పడ్డాయి. సూర్యకాంతి, అద్దం పైన పడి, ఆ తరవాత ముఖాన పడినట్లు, అతడి చూపులు చెదిరిపోయాయి. గుండె కూడా కాస్తంత కదిలినట్లయిందతడికి. వయ్యారంగా, అదే సమయాన వినయం ఉట్టిపడేలా నిలుచున్న ఆమె వేపు కనురెప్పలార్పకుండా, తన ముందుంచిన పెసరట్లను ముట్టుకోకుండా చూస్తూ కూర్చున్న శెట్టిని గమనించి, రామప్ప అన్నాడు. 'అలాగా, అదెవరనుకున్నావు జగ్గడి పెళ్ళాం సత్తెమ్మ'' శెట్టి వెంటనే సర్దుకొని, చూపులు మరల్చుకున్నాడు. ''జగ్గడా! వాడెవడూ?''

''జగ్గడి గురించి మీకు తెలిసుండదులెండి పచ్చి తాగుబోతు వెధవ. సోమరిపోతు. ఏడేళ్ళ క్రితం మాటలెండి ఒకనాడు తప్ప తాగి, జగ్గడు ఒకణ్ణి తన్నాడు. ఆ జగడం మరెక్కడో కాదు మా దుకాణం ముందే జరిగింది. ఇంతకూ ఆ జగడం ఎక్కువసేపు జరగలేదు. ఆ ఒక్క దెబ్బకూ క్రిందపడ్డవాడు, సరాసరి బండరాతి పైన తలబాదుకున్నాడు. ఆస్పత్రికి తీసుకువెళ్ళే దారిలోనే హరీ అన్నాడు. జగ్గణ్ణి పోలీసులు పట్టుకుపోయారు. ఆ జగ్గడి పెళ్ళామే సత్తెమ్మ ఇద్దరు మగ బిడ్డలు.''

''అదా సంగతి. నేను వినలేదు.''

''పాపం, అష్టకష్టాలు పడుతూ బిడ్డల్ని పోషిస్తూంది.'' అటుపైన శెట్టి మాట్లాడలేదు. పెసరట్లు తింటూ ఇలా అనుకున్నాడు. ''బీదతనంతో బాటు, సత్తెమ్మకు ఒంపుసొంపులు కూడా పుష్కలంగా ఉన్నాయి.''

# ఒక తల్లి-ఒక భార్య

ఆ రోజు, మొదటిసారిగా తన యిల్లు రామనాథంశెట్టికి అశుభ్రంగ కనిపించింది. వస్తువులన్నీ అస్తవ్యస్తంగా అమర్చి ఉన్నట్లు తోచింది చొక్కా విప్పి, వంకీల కర్రకు తగిలించి, అతడు వెంకన్నను పిలిచాడు. చంద్రపాలెంలో రామనాథం శెట్టి ఇంటిని వెంకన్నే చూస్తుంటాడు. రామనాథంశెట్టి ఊరికి వచ్చినప్పుడల్లా, అతణ్ణి గమనించి వేణ్ణీళ్ళు పెట్టడం, కాఫీ చేసి ఇవ్వడం మొదలైన పన్లు చేస్తాడు.

''దండాలు బాబుగారూ! మీరు రావడం చూడనేలేదు'' వెంకన్నవచ్చి నిలుచున్నాడు. రామనాథం శెట్టి ఓ మారు చుట్టూ పరకాయించి చూసి, 'ఇప్పుడే వచ్చానులే! లోపల ఏమి చేస్తున్నావు?'' అని అడిగాడు. ''మురికి నీళ్ళు వెళ్ళడంలేదు. కాలవను కర్రపెట్టి శుభ్రం చేస్తున్నాను.'' శెట్టి తలూపాడు. ''కాఫీ పెట్టమంటారా?''

''వద్దు. ఇప్పుడే తీసుకున్నాను.''

''వేణ్ణీళ్ళు పెట్టమంటారా?''

''తరవాత పెడుదువుగాని, ఇల్లు ఏమీ బాగలేదురా!''

''చిత్తం. రిపేరు చేయాలంటారా?''

''కాదు. ఇల్లు శుభ్రంగా లేదంటాను.'' వెంకన్న ఉలిక్కిపడి చూశాడు.

''ఎంతైనా మనం మగ వెధవలంగదటా! అంతటి శుచీ శుభ్రం మనకెలా గొస్తుందిలే! ఎవరైనా పనిగత్తెను ఇంట్లో పెట్టుకుంటే బాగుంటుంది''

''మరి నా సంగతి?'' అన్నట్లు దిగాలు పడి చూశాడు వెంకన్న. మాటా మంతీ లేకుండా అలా గుడ్లప్పగించి చూస్తున్న వెంకన్నను చూసి, ''అదేమిట్రా అలా గొరిల్లాలా చూస్తావు? నీకు సహాయంగా మరో పని మనిషి ఉండాలంటున్నాను. అర్థమయిందా?'' అని అడిగాడు.

''చిత్తం, చిత్తం'' అని బదులిచ్చాడు తేలికపడ్డ గుండెతో వెంకన్న.

''పని మనిషి చురుగ్గా ఉండాలి సోమరితనం అంటే నాకు గిట్టదు.''

''చిత్తం. బాగా వాకబుచేసే చెపుతాను.'' అని అతడు బదులిచ్చి వెనక్కితిరిగే లోపల, ''వెంకన్న మామయ్యా! వెంకన్న మామయ్యా!' అన్న పిలుపు వినిపించి, అతను వడివడిగా బైటకు వెళ్ళాడు.

రామనాథం శెట్టి వాకిట వేపు వెళ్ళి, యధాలాపంగా ''ఎవరది వెంకన్నా?'' అని అడిగాడు ''మరెవరో కాదు బాబుగారూ! మా సేవగోడలు సత్తెమ్మ.'' ఆ పేరు వినేంతనే శెట్టి చకచకా నడిచి బైటకొచ్చాడు. అక్కడ సత్తెమ్మ, ఒంటిమీదుగా చీరకప్పుకొని, నిలుచుని ఉంది. అతను నిమిషంపాటు ఆమెను తేరిపార చూశాడు ఆమె నిలుచున్న తీరులో కానవచ్చే వయ్యారం, అతణ్ణి ఉక్కిరిబిక్కిరి చేసింది. సత్తెమ్మ అతడి కళ్ళకు, మామిడి కాయలతో ఏపుగా పెరిగిన మామిడి చెట్టులా కనిపించింది. ''సత్తెమ్మ చాలా అర్జంటు పని పైన వచ్చినట్లుంది''

''అవును బాబుగారూ! రెండోవాడికి జ్వరమట''

''ఎప్పట్నించి?''

''రెండు రోజుల్నించి.'' ఈసారి సత్తెమ్మ బదులిచ్చింది.''

''ఎన్ని డిగ్రీలు''

''నాకు తెలవదు. పాలూ రొట్టె ఇస్తే బాగుంటుందని బుల్లెమ్మ చెప్పింది''

''బుల్లెమ్మ ఎవరు? వైద్యం తెలిసినావిడా?''

''అబ్బే కాదు మా పక్క గుడిసెలో ఉంది.''

''జ్వరం వస్తే పాలూ రొట్టె మాత్రం ఇస్తే చాలదు మాత్రలు, ఇంజక్షనూ ఇవ్వాలి, తెలుసా?'' అని అతడు జేబులోనుండి ఓ అయిదురూపాయల నోటు అందిచ్చాడు. కొత్తగా, పచ్చగా కనిపించిన ఆ అయిదు రూపాయల నోటుని చూసి, ఆమె అప్రయత్నంగా రెండడుగులు వెనక్కి వేసింది ''ఒక్క రూపాయి చాలు శెట్టిగారూ!'' ఈసారి రామనాథం శెట్టి బిగ్గరగ నవ్వాడు. ''ఓసి, పిచ్చిదానా? రూపాయి పాలూ రొట్టెకూ సరిపోతుంది. మరి ఇంజక్షను ఎలా ఇవ్వడం? నీబిడ్డడు ఎలా బాగుండడం?'' ఆమెమరి మాట్లాడకుండా శెట్టి చేతిలోని నోటుని తీసుకుంది.

మరునాడు ఉదయం సత్తెమ్మ రామనాథంశెట్టి ఇంటివాకిట ముందునిలుచుంది. ఆమెను చూసి వెంకన్న, ''లోపలకు రావే! బాబుగారు పిలుస్తున్నారు.'' అని చెప్పాడు.

[illegible]
తాకుతూ మొక్కుతున్న శెట్టి ముందుకువచ్చి "మీ మేలు మరచి పోము శెట్టిగారూ! బిడ్డడు బాగున్నాడు" అని అంది. అప్పు డతను తలెత్తి చూసి, "దానికేంలే! పిల్లాడికి మరో రెండురోజులు పాలూ రొట్టే ఇస్తూ ఉండు" అన్నాడు.

"మంచిది శెట్టిగారూ!"

"ఉదయమే విన్నెందుకు పిలిపించానో తెలుసా?" చిరుహాసం చేశాడు శెట్టి.

"తెలవదండి."

"నీ అవసరం వచ్చింది అందుకని పిలి పించాను ఇప్పుడు నీ బిడ్డల్ని ఎలా పోషిస్తున్నావు?"

"నాలుగిళ్ళల్లో కుండామండా కడుగు తానండి. మరో నాలుగు ఇళ్ళకు బావి నీళ్ళు పోస్తాను."

"అయినా బ్రతుకు కటాకటిగానే ఉంటుంది. అవునా?"

"తమరికి తెలియని దేముందండి."

"పెద్దకుర్రకాయ బడికివెళుతున్నాడా?"

ఈ ప్రశ్న విన్నంతనే సత్తెమ్మ కళ్ళనుండి కన్నీరు బొటాబొటా స్రవించింది. అప్పుడు వెంకన్న కలుగజేసుకొని అన్నాడు. "వాడికి కుడికాలు రాదండి."

"అలాగా! సరే, పర్వాలేదు. వాణ్ణి కూడా బడికి పంపించే ఏర్పాటు చేద్దాం. మువ్వా, నీ బిడ్డలూ బాగుండాలంటే మన్వు ఒక్కపని చేయాలి సత్తెమ్మా?"

"అవును సత్తీ! బాబుగారు చెప్పినట్లు చేయి. బిడ్డలు బాగుంటారు." వెంకన్న అన్నాడు; "చెప్పండి శెట్టిగారూ!"

"మా ఇంట్లో పని మనిషిగా చేరు. వెంకన్న సహాయంగా ఉంటాడులే. హోటలులో తినడం ఒంటికి పడడం లేదు. గొడ్డుకారం వేయడంవల్ల కడుపు నొప్పి వస్తుంది ముందులా కాకుండా, ఊరికే తరచుగా వస్తూ ఉండాలి. నేను వచ్చి నప్పుడల్లా అన్నం వండిపెట్టు. కారం ఎక్కువ తగిలించకుండా పులుసు చేయి. తక్కిన పనులన్నీ వెంకన్న చూసుకుంటా డులే!" ఆమె మౌనం వహించింది. కొన్ని క్షణాలు శెట్టి వేపు తేరిపార చూస్తూ నిలుచుంది.

"ఏం సత్తెమ్మా! మా ఇంట్లో పని చేయడం ఇష్టంలేదా!"

"[illegible] శెట్టిగారూ! [illegible] వాళ్ళకు వండాలంటే భయంగా వుంది."

"మరేం భయంలేదు. నీ ఇద్దరు బిడ్డలకూ ఎలా వండిపెడతావో అలాగే నాకు కూడా వండిపెట్టు." ఆమె మరి మాటాడలేదు

"ఏదైనా ముఖ్యమైన సామాను గట్రా ఉంటే - తీసుకురా! మీరు ముగ్గురూ ఉండాల్సిన రూమును వెంకన్నచూపిస్తాడు." ఆమె తలూపి బయటకు నడిచింది.

* * *

బాదరా బందీలతో బందీ అయి, తన బ్రతుకునూ, తన ముసలితల్లి బ్రతుకునూ, తన ముగ్గురు తమ్ముళ్ల బ్రతుకునూ ఈడ్చుకు పోవల్సిన బరువు తన పైన పడడం వల్ల, రామనాథం శెట్టి వెనుకా ముందూ చూడకుండా తాయారు మెడలో ముంగళసూత్రం కట్టాడు. ఇద్దరు బిడ్డలకు తండ్రి అయిన తరువాత, వ్యాపారం ఒళ్ళు విరుచుకొని లేచి నిలుచున్న తరవాత, అతడిలో నిద్రాణంగా ఉన్న రసికత్వం మత్తుగా మేల్కొంది. అలా మేల్కొన్న రసికత్వం ఒక్కసారిగా, ఉధృతంగా మేల్కొనడంవల్ల, మోహావేశం అతడి హృదయంలో పొంగి పొర్లింది. ఈ కారణంచేత, అతడు సత్తెమ్మ అందం ముందు, వయ్యారం ముందు, భక్తుడిలా మౌనంగా మోకరిల్లాడు.

[illegible] ఇంట్లో ప్రవేశించిన మరునాడే, రామనాథం శెట్టి మూడు కొత్తచీరలు పట్టుకొచ్చి ఇచ్చాడు. ఆ కొత్త చీరలను చూసి సత్తెమ్మ చూపులు ఓ క్షణంపాటు చెదిరి పోయినా, ఆ వెనువెంటనే ఆమె బిత్తర పోయి నిలుచుంది. "ఇంత ఖరీదయినవి ఎందుకు శెట్టిగారూ? ఒక్క సాదా చీర చాలు." ఆమె నేల వేపు చూపులు సారించి అంది. "ఊరుకోవే పిచ్చిదానా! చిని గుడ్డలతో ఇంట్లో తన్నాడుతుంటే, నా మర్యాద ఏమికాను? సాయంత్రం ఓ నూరు రూపాయలు పట్టుకువెళ్ళి కుర్రకాయ లిద్దరికీ కొత్తబట్టలు కొను అలాగే, వెంకన్నకు కూడా రెండు పంచెలు కొని పెట్టు." సత్తెమ్మ చిన్నగా నవ్వి, తలూపింది. అతడు అంతటితో ఆగలేదు. పెద్ద కుర్రాణ్ణి రిక్షాలో వెళ్ళి రిక్షాలో వచ్చేటట్టు దగ్గరమన్న ఓ స్కూలు హెడ్‌మాష్టరును పిలిపించి మాట్లాడాడు.

ఒక వారం రోజుల తరవాత, సత్తెమ్మ వంటగదిలో చేపల పులుసు చేస్తూ నిలు చున్నప్పుడు, రామనాథంశెట్టి నిశ్శబ్దంగా వంటగదిలోకి జొరబడి, తన రెండు చేతులతోనూ ఆమె నడుమును గట్టిగా బిగించాడు. ఆమె ఉలిక్కిపడి చూసిందేగాని - ఏమీ అనలేదు. బయట ఊత కోళ్ళలో పెద్ద



# ఒక తల్లి-ఒక భార్య

క్కరాడు పడవడం ఆమెకు స్పష్టంగా వినిపిస్తోంది.

సత్తెమ్మ స్వతస్సిద్ధంగా సౌందర్యవతి కావడాన, రామనాథం శెట్టి ఇంట్లో లభించిన వసతి, సౌకర్యం, ఆమె అందాన్ని రెట్టింపు చేశాయి. శరీరం నిగు పెక్కింది. మెరుపు అధికమైంది. ఆమె కళ్ళలోని తేజఃపుంజం అతణ్ణి రోజు రోజుకీ కోర్కెల తెరలలోకి, ఆనంద సముద్రపు లోతుల్లోకి లాక్కుపోతూంది. అతడి నడవడికలో మార్పు కనిపెట్టి, గాలివెరలపై ప్రాకుతూ వచ్చిన పుకార్లను కుదురుగా ప్రోగు పెట్టి, తాయారమ్మ ఓనాడు చెప్పా చేయకుండా నేరుగా చంద్రపాలెం వచ్చి, ఇంట్లో దిగింది. అప్పుడే సత్తెమ్మ తెచ్చిచ్చిన కాఫీని చప్పరిస్తూ కూర్చున్న శెట్టి, భార్యను చూసి ఉలిక్కిపడి లేచాడు. కప్పులోని కాఫీ ఒలికి అతడి పంచె రంగును మార్చింది

“నువ్వా తాయారూ! ఎందుకొచ్చావు?”

“ఊరకే రాలేదు. పనుండే వచ్చాను.”

“అదే, నేనూ అడుగుతున్నాను అదేం పని?”

“దానిని బైటకు గెంటుదామని.”

“దేనిని?”

“అదే మీ ప్రియురాలుగారిని.”

“ప్రియురాలా? అదెవరూ? వంటగత్తె సత్తెమ్మ ఉంది.”

“నన్ను దబాయించడానికి ప్రయత్నించకండి. మర్యాదగా దానిని బయటకు గెంటుతారా - లేకపోతే పదిమందినీ పిలవనా?”

“ఓహో అంతవరకూ వచ్చావన్న మాట! ఇప్పుడు చెప్తున్నాను విను. సత్తెమ్మ నాతోనే ఉంటుంది. అర్థమయిందా? నువ్వెవరి వద్దకు వెళ్ళి చెప్పుకుంటావో చెప్పుకో! ఎంత రాద్ధాంతం చేస్తావో చేసుకో!”

“మరి బిడ్డల సంగతి?”

“నీ గతీ, బిడ్డల గతీ బాగుండాలంటే నువ్వు మర్యాదగా ఇక్కణ్ణించి వెళ్ళు.” తాయారమ్మ ఆపైన మాట్లాడలేదు. గుడ్ల నీరు కుక్కుకుంటూ వెళ్ళిపోయింది.

* * *

ఒకనాడు సాయంత్రం, దీపాలు పెట్టే వేళ, ప్రేలాడే గుబురు గెడ్డంతో, మాసిన గుడ్డలతో ఓ వ్యక్తి, రామప్ప టీ దుకాణం వద్దకు వచ్చి సత్తెమ్మను గురించి వాకబు చేశాడు. “నువ్వెవరవయ్యా?” చిల్లర డబ్బులు లెక్క పెడుతూ కూర్చున్న రామప్ప అడిగాడు. ఆ ప్రశ్న విన్నంతనే ఆ వ్యక్తి జడుసుకున్నట్టు దూరంగా జరిగాడు.

“అదేమిటయ్యా అలా గుడ్లురిమి చూస్తావు? దీపాలు పెట్టే వేళ వచ్చావు పేరడిగితే, ఉలిక్కిపడతావు. అసలు నువ్వు ఏ ఊరునుంచి వస్తున్నావు?” ఆ వ్యక్తి వెంటనే బదులివ్వలేదు. కొన్ని క్షణాలు రామప్ప వేపు కన్నార్పకుండా చూసి, “నేనే రామప్ప” అని మాత్రం అన్నాడు.

“నేనే అంటే! గవర్నరువా?”

“జగ్గణ్ణి.” ఒక్క నిమిషం అక్కడ బరువైన నిశ్శబ్దం పేరుకుంది. రామప్ప కుర్చీలో నుండి లేచి నిలుచున్నాడు

“నువ్వట్రా జగ్గడూ! ఎందుకురా వచ్చావు? సత్తెమ్మ, దాని ఇద్దరు బిడ్డలతో హాయిగా ఉండడం నీకు నచ్చదా?”

“ఇంతకూ సత్తెమ్మ ఊరిలోనే కదూ ఉంది.”

“శెట్టిగారింటో, బిడ్డా పాపలతో హాయిగా ఉంది. శెట్టిగారి పుణ్యమా అని ఇద్దరు కుర్రాళ్ళూ చదువుకుంటున్నారు.” జగ్గడు మరి మాట్లాడలేదు. “తాగుబోతు వెధవ మళ్ళీ ఊడిపడ్డాడు. ఈ సారి ఎవరి బుర్ర బద్దలు కొడ్తాడో!” అక్కడి వాళ్ళ గుసగుసలు విని జగ్గడు మరో మారు జడుసుకున్నట్టు వెనక్కి తగ్గి, మౌనంగా నడిచి వెళ్ళిపోయాడు.

* * *

రామనాథం శెట్టి, పంపించవలసిన స్థలాలకు సరుకు రవాణా చేసి, చంద్రపాలెం బస్సు స్టాండులో దిగాడు. సత్తెమ్మను చూసి వారం రోజులయినా, సంవత్సరం గడిచిపోయినట్లు కష్టపడ్డాడు. అతణ్ణి అల్లంత దూరాన చూసిన వెంటనే వెంకన్న పరుగెత్తుకొచ్చాడు. “మోసం జరిగిపోయింది. బాబూ! పచ్చి మోసం జరిగిపోయింది.” గొల్లుతూ ఏడుచొచ్చిన వెంకన్నను చూసి, రామనాథం శెట్టి ఆశ్చర్యంగా చూశాడు. “అప్పుడు బాబుగారూ! ఏమండి నేను రెండురోజుల క్రితం పొరుగూరు వెళ్ళినప్పుడు, ఇంట్లో పెద్ద మోసం జరిగిపోయింది.”

"ఎవరు చేశారు ?"

"మరింకెవరు ? ఆ రంకులరాట్నం సత్తెమ్మ. పాముకి పాలు పోసి పెంచినా విషం మాత్రం ఎక్కడికి పోతుంది. ఇంట్లో నుంచి ఎంతడబ్బు, ఎంతనగా నట్రా తీసు కెళ్ళి పోయిందో ఆ దేవుడికే తెలివాలి." శెట్టి పాతాళంలో నిలుచున్నాడు. అతడి మెదడు ఆలోచించడం మానివేసింది. "దాని మొగుడు మొన్న జైలులోనుండి వచ్చాడు వాడితో బాటు వెళ్ళిపోయింది." "నా కేమీ వినిపించడం లేదు వెంకన్నా ! నువ్వే మంటున్నావు ? సత్తెమ్మ వాడె జగ్గడితో వెళ్ళిపోయిందంటున్నావా ?"

"ఊరకే వెళ్ళి పోలేదు బాబుగారూ ! చేతికి దొరికిన నగా నట్రా పట్టుకెళ్ళి పోయింది!"

"నువ్వు చూశావా ?"

"నేనుగాని ఊళ్ళో ఉంటే చూస్తూ ఉంటానా ? దాని రెక్కలు విరగ్గొట్టనూ? అందరూ చెప్పుకుంటున్నారు. ఇద్దరు ముగ్గురు దానిని సేట్ నగల దుకాణంలో చూచామని చెప్పారు." రామనాథం శెట్టి బదులివ్వలేదు. మౌనంగా ఇంట్లోపలకు నడిచి ఓ మారు చుట్టు పక్కలా కలయ జూశాడు.

"రండి బాబుగారూ ! పోలీసులకు ఫిర్యాదు చేద్దాం."

"వద్దు." అని అతడు మౌనంగా కూర్చున్నాడు. అతడి గుండెలపైన బరువు పేరుకుపోయినట్లయింది. "సత్తెమ్మ ఇలా చేసిందా ?" అతడు గొణిగాడు.

"అవును బాబుగారూ ! సత్తెమ్మే! మరెవరనుకున్నారు ? దొంగది అన్యాయంగా ఆ క్రూర కాయలిద్దరి బ్రతుకుల్నీ బుగ్గిపాలు చేసి వెళ్ళిపోయింది. మీరు దానికి ఏమి తక్కువ చేశారని ?

జాతి చూపరా బసూ అంటే అది దాని గుణం చూపించుకుంది."

రామనాథం శెట్టి మాట్లాడలేదు—మరి కొంతసేపు ఇల్లు నలువైపులా దిక్కులు చూసి, నిశ్శబ్దంగా లేచినిలుచుని బయటకు నడిచాడు. వెంకన్న అతణ్ణి వెంబడించాడు. కొద్ది దూరం నడిచి, "నువ్వెందుకురా వెంకన్నా ? నేను వెంకటగిరి వెళ్తున్నాను. నువ్వెళి రా !" అన్నాడు శెట్టి.

...టు దుకాణానికి వెళ్ళనా ?"

"ఎందుకూ ?"

"సత్తెమ్మ ఎంత బంగారం కొనుక్కొని వెళ్ళిందో తెలుసుకుంటే కనీ—పోలీసులకు కబురు పంపించవచ్చు."

"వద్దు."

"అలా మరీ వైరాగ్యం పెంచుకో కూడదు బాబుగారూ ! ఇన్నాళ్ళూ మీ ఉప్పు తిని బ్రతికినవాణ్ణి. మీ మంచి కోరడం నా ధర్మం."

"ఎందుకులే వెంకన్నా ! అంతా అయి పోయింది. పోలీసులకు చెప్పి, ఏట్టకేలకు కలుసుకున్న భార్యాభర్తలను విడిపించడం మంచిపని కాదు."

"అప్పే, అలా అంటే ఎలాగండీ ! అదిగో, సేట్ కూడా ఇలానే వస్తున్నాడు. సేట్‌గారూ, సేట్‌గారు ! ఆ సత్తెమ్మ మొన్న మీ దుకాణం వచ్చి ఎంత బంగారం కొన్నది సేట్‌గారూ !" అని ఆ సేట్‌కి ఎదురు వెళ్ళి అడిగాడు.

"నమస్కార్ సెట్టిగారూ ! ఆ సత్తెమ్మ అలా మిమ్మల్ని విడిచి పెట్టి ఆ కేడీగడితో వెళ్ళిపోతుందని నేను అనుకోలేదు. రండి. దుకాణంలోకి వచ్చి కూర్చోండి. నేను పనుండి నాగ్‌పూర్ వెళ్ళాను. వారం రోజులుగా దుకాణంలో కూర్చోలేదు. నా పెద్ద కొడుకుని అడిగి వివరాలు తెలియ జేస్తాను."

రామనాథం శెట్టి మౌనంగా దుకాణం లోకి ప్రవేశించి కూర్చున్నాడు.

"కూల్‌డ్రింకు తీసుకుంటారా ?"

శెట్టి వద్దన్నట్టు తలాడించాడు.

"ఒక మాట చెప్పడం మరచిపోయాను శెట్టిగారు ! నాగపూర్‌నుండి ఒక కొత్త డిజైను నెక్లెస్ వచ్చింది. ముందొక సారి మీరు కావాలని చెప్పినట్టు జ్ఞాపకం. మీ భార్యగారికి తీసుకువెళ్ళి చూపిస్తారా ?" సేట్ అడిగాడు. "తరవాత చూద్దాం." శెట్టి అసహనంగా చూశాడు. అప్పుడు వెంకన్న కలుగజేసుకొని అన్నాడు. "అయ్యా సేటూ ! ఇప్పుడేమీ అవసరంలేదు. సత్తెమ్మ ఎంత బంగారం కొనుక్కొని పరుగెత్తిందో కనుక్కొని చెప్పు. అది చాలు." కుతకుత లాడుతూన్న కోపం వెంకన్న కంఠస్వరంలో ప్రస్ఫుటితమైంది.

"ఎందుకు వెంకన్నా అలా తొందర పడతావు ? ఆ రకం నెక్లెస్ మళ్ళీ బజారు లోకి రావడం ఎంతకష్టమో నీకుతెలుసా?" అని సేట్ చకచకా లోపలకు నడిచి, కను మరుగయాడు. అయిదు నిమిషాల తరవాత సేట్ పెదవి విరుస్తూ బయటకు వచ్చాడు. "అంతా అబద్ధం ! అంతా అబద్ధం ! సత్తెమ్మ నగలు కొనలేదు." శెట్టి ఆశ్చర్యం అణచుకోలేక లేచి నిలుచున్నాడు. "అదేమిటి సేట్ ! మీ దుకాణంలో సత్తెమ్మను చూపినట్టు ఇద్దరు ముగ్గురు








రాగతి
పండరి

## ఒక తల్లి-ఒక భార్య

చెప్పారే!' వెంకన్న గట్టిగా అన్నాడు "ఉష్! గట్టిగా అరవకు." అని వెంకన్నకు అడ్డతగిలి, "శెట్టిగారూ! మీరు వినండి సత్తెమ్మ నా నగల దుకాణానికి వచ్చిన మాట వాస్తవమే! కాని నగలు కొనలేదు ఎప్పుడో తాకట్టు పెట్టిన దాని నగ ఒకటి విడిపించుకుంది అంతే! ఆ నగ ఖరీదు ఎంతో చూపిచెప్పమంటారా?" అన్నాడు సేట్

"వద్దు సత్తెమ్మ విడిపించుకొన్న నగ ఏమిటో చెప్తే చాలు" అన్నాడు శెట్టి.

"అది నగేమిటో కాదు శెట్టిగారూ! దాని మంగళసూత్రం" ఒక్క నిమిషం పాటు అక్కడ నిశ్శబ్దం వ్యాపించింది శెట్టి మరి మాట్లాడకుండా బయటకు నడిచాడు "శెట్టిగారూ! ఆ నెకస్" 'ఉష్!" అని సేట్‌కి అడ్డతగిలి, వెంకన్న శెట్టిని అనుసరించాడు "మంగళసూత్రం! మంగళసూత్రం!" శెట్టిచెవిలో ఈ మాట గింగురుమంటూంది అతడి గుండెల్లో ఆ మాట కోటి కంఠస్వరాలతో ప్రతిధ్వనిస్తూంది అతడలా కొద్ది దూరం నడిచి చటుక్కున ఆగాడు

"వెంకన్నా!"

"బాబుగారూ!" వెంకన్న ముందుకు వచ్చి నిలుచున్నాడు

"మరి నువ్వు వెళ్ళి రా!"

"మళ్ళీ మీరు ఎప్పుడువస్తారో సెలవిస్తే బాగుంటుంది"

"పనుంటే తప్పకుండా వస్తాను"

"చిత్తం" అని వెంకన్న వెనక్కి తిరిగాడు.

"వెంకన్నా!" శెట్టి అప్రయత్నంగా అరిచాడు

"అయ్యా!" మాసుకు వచ్చాడు వెంకన్న

"మళ్ళీ సత్తెమ్మ ఊసు మరెక్కడా ఎత్తకు నేను కష్టపెట్టుకుంటాను"

వెంకన్న కళ్ళలో కన్నీరు సుళ్ళు తిరిగింది బదులివ్వడానికి పెదవులిప్పలేక, గొంతు పెగల్చలేక, మౌనంగా ఖ్కరఊపాడు. శెట్టి అక్కణ్ణించి కదలి, వెంకటగిరి వెళ్ళే బస్సు వేపు నడిచాడు. తన యజమానిని తేరిపార చూస్తూ, అక్కడే నిలుచున్నాడు వెంకన్న.

## మొగలాయ్ బిరియాని

కావలసినవి:— పలావ్ బియ్యము – 500 గ్రాములు, మాంసము – 500 గ్రాములు, జీడిపప్పు 55 గ్రాములు పచ్చిమిర్చి 6 కాయలు, కొత్తిమీర 1 కట్ట, అల్లము చిన్నముక్క, లవంగాలు ఐదు, యాలకులు ఐదు, పసుపు చిన్నస్పూను, పాలు 100 గ్రాములు, కుంకుమపువ్వు కొద్దిగ (శక్తికొలది), పొదీనా ఒక కట్ట, ఉల్లిపాయలు 200 గ్రాములు, పెరుగు 225 గ్రాములు, ఎండుమిర్చి 6 కాయలు, నిమ్మకాయి ఒకటి, మసాలా ఆకులు కొద్దిగ వెల్లుల్లి రేకలు ఆరు, దాల్చిన చెక్క 5 ముక్కలు, డాల్డా 115 గ్రాములు, నీరు బియ్యానికి రెట్టింపు (4 గ్లాసులు).

చేయువిధానము: మాంసము శుభ్రపరచి ముక్కలు కోయవలెను. ఉల్లిపాయలు రెరు అలా తరుగుకొనవలయును. పొదీనా, కొత్తిమీర కూడ సన్నగ తరగవలెను. అల్లము వెల్లుల్లి, పచ్చిమిర్చి, ఎండుమిర్చి మెత్తగ రుబ్బుకొనవలెను. మాంసము ఒకగిన్నెలో వేసి పెరుగు మారిన మసాలా వేసి ఒకటిన్నర గంట నాననివ్వవలెను. ఉప్పు కూడ వేయవలెను. స్టౌ మీద కుక్కరు పెట్టి డాల్డా వేసి ఉల్లిపాయలు వేసి ఎర్రగ వేపుకొని తీసి ఉంచుకొనవలెను. తరువాత మసాలా ముద్దతో పెరుగుతో నానిన మాంసము కుక్కరులో వేసి ఒకగ్లాసు నీరుపోసి మూతమూసి స్టీము



## వంటలు

రాగానే వెయిట్ పెట్టి పదినిముషములు ఉంచి దింపి వేయవలెను. దింపి కూర అంతవేరొక గిన్నెలోకి తీసుకొనవలెను. ఇక బియ్యము కుక్కరులో వేసి మూడు గ్లాసులు నీరుపోసి మూతమూసి స్టీమురాగానె రెండు నిముషములుఉంచి దింపి వేయవలెను యాలకలు, దాల్చిన చెక్క, లవంగాలు పొడి గొట్టి అన్నములో వెయవలెను. నిమ్మకాయ రసము పిండి అన్నముతో కలపవలెను. కొత్తిమీర పొదీనా కూడ అన్నములో వేయవలెను కుంకుమపువ్వు పాలలో కలిపి అన్నములో జల్లవలెను. (అన్నానికి కూరకు సరిపోవునట్లు ఉప్పు వేసుకొనవలెను.) పసుపు కూడ వేసి బాగా అన్నాన్ని కలపవలెను.

ఒక వెడల్పాటి గిన్నె తీసుకొని, ఉల్లిపాయలు, మాంసము అన్నం అన్నీ పొరలు మాదిరిగా వేసుకొంటు పూర్తిగ అయిపోయిన పిదప మిగిలిన పాలు కూడ జల్లివేసి మూతమూసి మూతచుట్టు గోధుమ పిండి ముద్దతో సీల్ చేసి గిన్నెను స్టౌ మీద సన్నని మంటమీద పెట్టి అర గంట ఉంచి దింపి వేయవలెను. బొగ్గుల కుంపటి ఉన్న కొన్నినిప్పులు గిన్నెమూత మీద కూడ వేయవచ్చును.

— మాదిరెడ్డి లక్ష్మీగణపతి.

## బొబ్బర్ల వడలు

బొబ్బర్ల వడలు చాలామందికి తయారు చేయటం తెలియదు. వీటి రుచి ఒకసారి మరిగారంటే అన్నమానుకొని వీటినే పనిగా తింటూంటారు. ఇవి ఒంటికి బలంకూడా!

కావలసిన వస్తువులు:— బొబ్బర్లు — పావు కిలో, పచ్చిమిర్చి — అర్ధ డజను, కొత్తిమీర — ఒక కట్ట, అల్లం చిన్నముక్క, ఉల్లిపాయలు—5, బియ్యపుపిండి - పావు కిలో, జీలకర్ర—2 చెంచాలు, ఉప్పు— తగినంత!

తయారుచేయుట: — మొదట బొబ్బర్లు నానబెట్టాలి. నానబెట్టాక, గట్టిగా మెత్తగా రుబ్బాలి. రుబ్బినాక అందులో బియ్యంపిండి, తగినంత అల్లంముక్కలు, కొత్తిమీర, పచ్చిమిర్చి ముక్కలు, ఉల్లిపాయ ముక్కలు, జీలకర్ర, ఉప్పు వేసి బాగా కలపాలి. తరువాత మూకుడులో నూనెపోసి కాచి ఈ పిండిని చిన్న చిన్న వడలుగా వేసి ఎర్రగా వేయించుకోవాలి. ఇవి చాలా రుచిగా ఉంటే, రెండు రోజులు నిలవ కూడా ఉంటాయి.

జి. రామలక్ష్మి



# మహత్కార్యం



కాళీపాక | రమామురళి

ఈ కార్యభారాన్ని అంతా కలిపి నా నెత్తి మీదకి ఎందుకు తోసేసారో, ఎలా నన్ను ఒప్పించగలిగారో, నేను ఈ బాధ్యత ఎందుకు తీసుకున్నానో, ఇప్పటికీ నాకు అర్థం కాని ప్రశ్నలు. అందజెయ్యవలసింది శుభ వర్తమాన మైతే వాయువేగ మనోవేగాలతో తేలుతూ, తుళ్ళుతూ వెళ్ళవచ్చును. కాని ఈ వార్త అందజెయ్యడానికి నా కాళ్ళు ముందుకు సాగటంలేదు.

"ఒరే మోహన్, ఈ అప్రాచ్యుడు చేసిన పనికి సిగ్గుతో, అవమానంతో కృంగి పోతున్నాం. వాళ్ళకి మా ముఖం ఇంక చూపలేం నువ్వే ఏదో సర్ది చెప్పిరా. నీకు మాట నేర్పూ, మంచితనం వున్నాయి. వారు నొచ్చుకోకుండా మెల్లిగా వున్నమాట బయట పెట్టిరా" అన్నాడు పెదనాన్న, కొడుకు చేసిన నిర్వాకానికి మండిపడుతూ.

"వాళ్ళెందుకు నొచ్చుకోరూ? బాధ పడరా? ఇంత ప్రయత్నం జరిగాక, వారి కెంత కష్టం కలుగుతుంది! ఎంత బాధ పడతారు! ఆ బాధలో ఎన్నిమాటలంటారో, మనకి ఎన్ని శాపనార్థాలు పెడతారో! మనకి ఈ శాస్తి జరగవలసిందే లెండి! వారికి మనవల్ల జరిగిన అనర్థం, కొంచెమా? మాటలతో కరిగే పూరటా!" పెద్దమ్మ ముఖంలో కళ తప్పింది పదిరోజులుగా రోగగ్రస్తగా వున్నట్టు పాలిపోయింది

ఈ గొడవకంతా మూలకారణం అయిన మా పెదనాన్న కొడుకు చంద్రం మాత్రం గుళ్ళో మూలవిరాట్టులా పులకక పలకక రాయిలా కుర్చీలో బిగుసుకు కూర్చున్నాడు.

"వెళ్ళు నాయనా, మోహన్ వెళ్ళు. వారికి ఇక్కడ జరిగిన విశేషాలన్నీ చెప్పి, వారు వేసే అక్షింతలు వేయించుకుని రా. మనం ఇప్పుడు క్షమార్పణలు చెప్పినా బాగుండదు. లెంపకాయ కొట్టి క్షమించమన్నట్టు వుంటుంది. ఈ వెధవ చేసిన పనికి మనం కొన్నాళ్ళు నలుగురికీ ముఖం చూపించలేం" అంది అతని పెద్దక్క కామేశ్వరి, పిల్లదానికి తల దువ్వుతూ. ఆవిడ తమ్ముడి మీద వుండే కోపమంతా కూతురి తలమీద చూపుతోంది ఆ పిల్లది కదిలినప్పుడల్లా ఓ మొట్టికాయ మొట్టుతోంది

ఆ రోజు ఉదయం నించీ జరిగిన చిత్రాలు నెమరు వేసుకుంటూ పురుషోత్తం గారి ఇల్లు చేరాను. ఇంటిముందు పందిరి వేసారు. పచ్చి కొబ్బరాకుల వాసన కమ్మగా వుంది పందిట్లో సన్నాయి మేళం.

"పెళ్ళికి మూడు రోజుల ముందరే వీరింట్లో ఏమి సందడి?" అనుకుంటూ ముందుకు దారితీసా.

హాలునిండా ముత్తైదువలు, పట్టు చీరల హడావిడి నుదుట కల్యాణం బొట్టుతో, బుగ్గన నల్లని చుక్కతో, ఎర్రని పట్టుచీర కట్టుకుని లక్ష్మీదేవిలా కూర్చున్నది మంగళ. ఆమెకి హారతి పడుతున్నారు సుమంగళులు

"అరే, బావగారు వచ్చారు" అంటూ మంగళ అన్న శ్రీనివాస్ ముందుకు వచ్చాడు.

అందరి కళ్ళూ నావైపు తిరిగాయి

"సమయానికి వచ్చారే" అంటూ ఆడ పెళ్ళివారింట్లో పెద్దలంతా సంభ్రమంగా నన్ను ఆహ్వానించి, మర్యాద చేసారు. నేరస్థుడికి కలిగే లజ్జ కలిగింది నాకు.

నాకు వేసిన కుర్చీలో ఇబ్బందిగా కూర్చుని "ఇవాళ ఏమిటి విశేషం? పెళ్ళి ఇంకా మూడు రోజులుందిగా!" అన్నాను.

"ఇవాళ మంచి రోజని మంగళని పెళ్ళి కూతురిని చేశాం మీ అన్నయ్యని కూడా యివాళే పెళ్ళి కొడుకుని చేస్తామన్నారు – మీ పెదమ్మ చెయ్యలేదా?' అంది మంగళ తల్లి, హారతి పళ్ళెం క్రింద పెట్టి, నా వైపు చూస్తూ.

"వుహూఁ" తల అడ్డంగా తిప్పాను ఇంకా పెళ్ళికొడుకుని చెయ్యడ మేమిటి? అని మనసులో విసుక్కున్నా

"పెళ్ళినాడే చేసేస్తారేమో లెండి"

శ్రీనివాస్ భార్య ఫలహారపు పళ్ళెం తెచ్చి నా ముందు పెట్టింది ఓ ప్రక్క యిడ్లీ, రెండో వైపు కారంబూంది, మిఠాయి

"అరే, యిప్పుడు యివన్నీ ఏందుకు?"

"ఇప్పుడు కాకపోతే యింకెప్పుడు జరతాయి మగ పెళ్ళి వారి మర్యాదలు" కాబోయే అల్లుఁగ తమ్ముడు! మరి ఘనంగ వుండవద్దా మర్యాదలు" ఓ పట్టుచీర వ్యాఖ్యానం

ఫలహారపు పళ్ళెం నాచేతిలోకి వచ్చింది బూందీ తింటూవుంటే గులకరాళ్ళు తింటున్నట్టూ, మిఠాయి మింగుతూ వుంటే గరళం సేవించినట్టూ వుంది నాకు

"ఏమిటి మగపెళ్ళి వారి కబుర్లు? మీవాళ్ళంతా వచ్చేసారా? మీ అక్కయ్యలూ, బావలూ వచ్చారా?" మంగళ తల్లి దూరం నించే ప్రశ్నించింది

నేను వినిపించుకోనట్టు ఫలహారం వైపు చూస్తూ కూర్చున్నా

"చెప్పండి మోహన్ గరూ! మా మంగళని చూసారా? ఎంత కుతూహలంగా ఒళ్ళంతా కళ్ళుచేసుకుని వింటోందో?— మా బావగారి కబురు చెప్పండి మంగళా, యిక్కడికిరా యిలా కూర్చో" అన్నాడు శ్రీనివాస్ నవ్వుతూ

"పో అన్నయ్యా" అంది సిగ్గు పడుతూ మంగళ

"ఫరవాలేదు, పేరంటం అయిందిగా! యిలారా, యిక్కడ కూచుందువుగాని"

"వుండరా శ్రీనూ, అమ్మాయిచేత పెద్దలందరికీ నమస్కారాలు చేయించనీ మీనాన్న ఏరీ? బయట వున్నారేమో ఒక్కసారి పిలు" మంగళ తల్లి ముత్తైదువులకి తాంబూలాలు యిస్తోంది

శ్రీనివాస్ వెళ్ళి పురుషోత్తం గారిని పిలుచుకు వచ్చాడు మంగళలేచి తల్లీ తండ్రికీ, పెద్దలకీ నమస్కరించి ఆశీర్వచనాలు తీసుకుంది

"ఓహో, మోహన్, వచ్చావా? ఏమిటి విశేషం? మావియ్యాల వారి కబుర్లేమిటి?" పురుషోత్తంగారు నాదగ్గిరకి వస్తూనే నూటిగా, ఆదరంగా ప్రశ్నించారు

ఆయనని చూస్తూనే నా కర్తవ్యం గుర్తుకు వచ్చి నోట్లో తడి ఆరిపోయింది లేచి నుంచుని నమస్కరించాను

"కూర్చో, కూర్చో యిప్పుడే వస్తా సావకాశంగా మాట్లాడుకుందాం" అంటూ ఆయన హడావిడిగా మళ్ళీ బయటకి వెళి పోయారు

శ్రీనివాస్ భార్య కాఫీ తెచ్చి యిచ్చింది.

"మీరు నన్ను చాలా మొహమాట పెట్టేస్తున్నారు" అంటూ కాఫీ అందుకున్నా.

మంగళ ఎప్పుడు వచ్చి కూర్చుందో, మా ప్రక్కనే కుర్చీమీద కూర్చుని వుంది. చేతులకి క్రొత్త బంగారు గాజులూ, వాటి మధ్య రంగు రంగుల గాజులూ వున్నాయి అరచేతులకి గోరింట రంగు అందంగా అమరింది కాళ్ళకి పసుపు పూసి, పారాణి అలివారు అప్పుడే విచ్చుకుంటున్న మందార పువ్వులా వుంది ఆమె ఆమె జడ లోంచి వ్రూలాడ్తున్న మొగలిపూల వాసన వచ్చి మత్తెక్కించి, వుక్కిరి బిక్కిరి చేస్తోంది.

మంగళ నన్ను చూసి పలకరింపుగా చిన్నగా నవ్వింది. నా గుండె భయంతో

# దూతకార్యం

కొట్టుకుంది. నేను చెప్పే మాట వినగానే యీమె ఆనందమంతా ఆవిరిలా హరించి పోదా? ఒక్కసారిగా మొదలునరికిన చెట్టులా కూర్చపోతుందా? ఈమె జీవితం ముందు ముందు ఏమి కానున్నది? ఇంత హాయిగా, నిర్మలంగా తిరిగే మంగళ నవ్వగలదా?

హే, భగవాన్! నే నెందుకు యిక్కడికి వచ్చాను? ఎందుకు వీరందరి సంతోషాన్ని మట్టుపెట్టే వార్త తెచ్చాను? నేను నోరు విప్పి ఎలా చెప్పను? వీరి ఆదరణా, మర్యాదా నన్ను వుక్కిరి బిక్కిరి చేస్తున్నాయి.

"రండి మోహన్‌గారూ, పైన మేడ మీద మా వాళ్ళంతా పేకాట వేసారు. నాన్నగారు వచ్చేవరకూ మీరూ కూర్చుందురు గాని" శ్రీనివాస్ నన్ను మేడమీదకి తీసుకు వెళ్ళాడు.

పెద్దా, చిన్నా ఓ పదిమంది మగవాళ్ళు పేకాడుతున్నారు. ముక్కలు పంచుతున్నారు. కాఫీలు త్రాగుతున్నారు. సిగరెట్లు కాలు స్తున్నారు. చతుర్ముఖ పారాయణం జోరుగా సాగుతోంది. నా మనసు మాత్రం ఆటలో లగ్నం కాలేదు.

ఇంత మంది చుట్టాలు, స్నేహితులూ పెళ్ళికని మూడు రోజులు ముందే వచ్చి దిగ్బడేసారు. పురుషోత్తం గారికెంత ఖర్చు!

వీరందరూ నేను చెప్పిన మాటలు వింటూనే కోపంతో నామీద లేస్తారా? ఒక్కుమ్మడిగా మీదపడికొడితే నేనేమవ్వాలి? పద్మవ్యూహంలో ప్రవేశించిన అభిమన్యుడి తంతులా వుంది నా పని.

"పెళ్ళికూతురి పట్టుచీరలు చూసావుటే పద్మా? కంచి నించి తెప్పించారుట!"

"మంగళ నెక్లెస్ బాగుంది సుమా!"

"వియ్యపురాలి చీర కూడా బ్రహ్మాండంగానే వుంది. పెద్ద జరీ"

"ఆడబడుచు లాంఛనాలు వున్నాయా?"

"లేకేం?..."

"పెళ్ళికొడుకు ఏం చేస్తున్నాడుట?"

"అదేదో ఆఫీసులో పెద్ద వుద్యోగంట"

"ఆఫీసరుట..."

ప్రక్కగదిలోంచి ఆడవాళ్ళ మాటలు వినిపిస్తున్నాయి.

అక్కడ కూర్చున్నకొద్దీ నాకు ఆడపెళ్ళి వారి మీద అభిమానం, జాలి ఎక్కువౌతున్నాయి. మంగళని నేనేవిధం రక్షించ గలను?

"భోజనాలకి లేవండి మామయ్యా, వడ్డించేసారు" శ్రీనివాస వచ్చి అందరిని లేవదీసాడు.

"మీరలా కూర్చున్నారేమిటి మోహన్. లెండి, లెండి, కాళ్ళు కడుక్కోండి"

"నేను యిందాకే కదా ఫలహారం చేసాను నాకు ఆకలిలేదు"

"పెళ్ళింట్లో భోజనం చెయ్యకుండా ఎలా వెళతారు? మేం పంపుతామా?" శ్రీనివాస్ బలవంతంమీద లేవక తప్పలేదు.

హాల్లో మగవాళ్ళ పంక్తికి వడ్డించారు. వంటాయన ఒకరూ, యింట్లోని స్త్రీలు కొంతమంది వడ్డన చేస్తున్నారు.

"ఈ భోజనం తింటూ వుంటే మా స్నేహితుడి పెళ్ళి భోజనం గుర్తుకు వచ్చింది." అన్నాను వుపోద్ఘాతంగా ప్రక్కన కూర్చున్న శ్రీనివాస్‌తో.

"ఎందువల్ల?"

"వాడి పెళ్ళి చాలా అనుకోని విధంగా హఠాత్తుగా అయింది."

"అంటే ముందే నిశ్చయించుకున్నది కాదా?"

"లేదు. వాడు, వాడి అన్నగారి పెళ్ళికని తరలి వెళ్ళాడు. చివరికి ఆ అన్నగారికి కాబోయే వధువుని పెళ్ళి చేసుకుని వెనక్కి వచ్చాడు."

"తమాషాగా వుందే! అలా ఎలా జరిగింది?"

"వాడి అన్న ఓ ప్రబుద్ధుడయ్యాడు. ఏడాది క్రితమే ఒకామెను రహస్యంగా పెళ్ళి చేసుకున్నాడు. ఆమెతో కాపరం వెలిగించాడు. ఓ ఏడాది తరువాత ఆమె నచ్చలేదుట, తండ్రి కుదిర్చిన యీ పెళ్ళికి ఒడంబడ్డాడు. పెళ్ళంతా నిశ్చయమై, ముహూర్తాలు పెట్టుకుని పెళ్ళికి బయలు దేరే ముందు అతను రహస్యంగా చేసుకున్న అమ్మాయి, తల్లిదండ్రులను తీసుకుని వచ్చి అల్లరి పెట్టింది. పెళ్ళి ఫోటో ఒకటి చూపి రచ్చ చేశారు. దానితో రెండో పెళ్ళి ఆగిపోయింది. నవ వధువు అవస్థ, ఆమె తల్లి దండ్రుల బాధ చూడలేక మా స్నేహితుడు ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుని, అందరి మనసులలోని బెంగ తీర్చాడు.

అలా నరులు మారినా కథ సుఖాంతంగా ముగిసి, కళ్యాణం జరిగింది'' నా కథ ముగించి చుట్టూ చూశాను. ఆ పంక్తిలో కూచున్న వారంతా భోజనాలు ముగించి నే చెప్పే విషయాన్ని చాలా కుతూహలంగా, ఆశ్చర్యంగా వింటున్నారు.

''మోహన్ కథలు చెప్పడం అయిందా? చెయ్యి కడుక్కోనిరా, అంతా లేవండి' పురుషోత్తంగారు ఎంతసేపటినుంచి ఈ ప మాటలు వింటున్నారో, గుమ్మందగ్గర నుంచుని, గట్టిగా చెప్పారు. ఆయన గొంతుకలోంచి తొంగి చూస్తున్న కఠినత్వం భయం గొలిపింది.

మౌనంగా వెళ్ళి చేతులు కడుక్కొని మెల్లిగ వచ్చాను.

పురుషోత్తం గారి చెయ్యి విసురుగా వచ్చి నా చెంపని ఛెళ్ళు మనిపించింది. నేను ఈ హఠాత్సంఘటనకి బిత్తర పోయాను

''నువ్వు చెప్పిన వివాహితుడి అన్న కథ నిజం. అది మీ అన్న కథే కదూ? అది చెప్పాలనే నువ్వు వచ్చావు. అవునా? ఇదుగో యిప్పుడే నాకూ ఈ పుత్తరం అందింది మీ అన్న భార్య రాసింది'' ఆయన ఎడం చేతిలోని కవరుని నా కళ్ళ ముందాడించారు.

మాట లేకుండా బండలా నుంచున్నాను. మా చుట్టూ ఈ గొడవకి మనుష్యులంతా పోగయ్యారు. వెనకగా మంగళ ఎర్ర చీరా కనిపిస్తోంది.

''బద్మాష్ చల్లకొచ్చి ముంతదాచినట్టు, ఈ వెధవ కబురు చేరెయ్యడానికి వచ్చి, మా యింట్లో విందులు ఆరగిస్తూ, మర్యాదలు చేయించుకుంటున్నావా? మిమ్మల్ని ఏంచేసినా పాపముండదు, నాపిల్ల గొంతు కోద్దామనుకున్నారు. నాటకం ఆడారు'' ఆయన గొంతు పైపైకి లేస్తోంది.

''ఏమిటి? ఏం జరిగింది?'' ఇంట్లో అందరూ గొడవగా మాట్లాడుతున్నారు.

''ఆ పెళ్ళికొడుక్కి ముందే ఒక పెళ్ళి జరిగిందిట. ఆవిడే మావయ్యకి పుత్తరం రాసిందిట''

''ఆఁ. ముందే పెళ్ళిజరిగిందా? అయ్యో, మంగళా, తల్లీ. నీగతి ఏం కానే?'' మంగళ తల్లి ఆర్ద్రంగా, భయవిహ్వలతతో అరిచి నేలమీద కూలబడింది. మంగళ, తల్లి పక్కనే తల వంచుకు కూర్చుంది.

''ఉండు బావా అసలు సంగతి ఏమిటో, వివరంగా కనుక్కుందాం'' అంటూ పురుషోత్తంగారి బావమరిది నా రెక్క పుచ్చుకుని ప్రక్కకి తీసుకు వెళ్ళి; ఓ బెంచీ మీద తన పక్కన కూర్చో పెట్టుకున్నాడు

''ఇప్పుడు చెప్పు అబ్బాయ్. నిజంగా మీ అన్నయ్యకి ముందే పెళ్ళి జరిగిందా? మరి మమ్మల్ని ఈ గోతిలోకి ఎందుకు దింపారు?''

ఆయనకి నేను అన్నీ వివరించాను. మా పెదనాన్న కొడుకు తన పెళ్ళి విషయం యిన్నాళ్ళూ రహస్యంగా వుంచాడనీ, నిన్నటి వరకూ మాకూ ఎవరికీ తెలియదని, నిన్న అతని భార్యనని చెప్పుకుంటూ వచ్చిన ఆమె వల్ల వివరాలన్నీ తెలిసాయనీ చెప్పాను. మా పెదనాన్న, పెదమ్మా ఎంత బాధ పడుతున్నారో, నా చుట్టాలంతా మా అన్నను ఎలా తూలనాడుతున్నారో వివరించాను తెలిసి, తెలిసి యిప్పుడు మంగళను ఈ వివాహ బంధంలో యిరికించడం యిష్టం లేక పెదనాన్న నన్ను పంపారని చెప్పాను

''ఈ వచ్చి నిజాన్ని ఎంత కథగా చెప్పి మోసగించాలని చూశావోయ్? ఏలాగైనా ఘటికుడవు.''

''మిమ్మల్ని మోసగించడం మా అభిమతం ఎప్పుడూ కాదు. అలా అనుకుంటే ఈ వెనక కథంతా దాచిపెట్టి మా అన్నకి పెళ్ళి, రెండో పెళ్ళి జరిపించి వుండే వాళ్ళం.''

''మిమ్మల్ని నమ్మమనే! పెళ్ళి ఏనాడో జరిగినా మీకు ఎవరికీ మీ అన్న పెళ్ళి విషయం తెలియదంటే నమ్మబుద్ధి కావటం లేదు. ఈనాడు మొదటి భార్య వచ్చి రచ్చ చేసింది కనక, ఈ పెళ్ళి మానుకున్నారు''.

''మీరేమనుకున్నా, నేను చెప్పలేను.''

''నిజమే లే. నష్టపోయింది మేము, ఇప్పుడు మమ్మల్ని ఏం చెయ్యమంటావ్?'' పురుషోత్తంగారు విసురుగా అన్నారు.

''అతనే తన కథలో పరిష్కారం చూపించాడుగా!'' శ్రీనివాస్ వ్యంగ్యంగా అన్నాడు.

''ఏమిటి?'

''అన్నకి తప్పిపోయిన సంబంధం, తమ్ముడు చేసుకున్నాడని. ఇప్పుడు అడగండి, యితను మంగళని చేసుకుంటాడేమో!''

నాగుండె లయ తప్పింది నేను వూహించని కథ నడుస్తోంది

పురుషోత్తంగారు నావైపు సూటిగా చూశారు

''చదువు అయి, వుద్యోగం చేస్తున్నావు కదూ?''

'ఉద్యోగం కాదు. మానాన్న దగ్గరే జూనియర్ ప్లీడరుగా వుంటున్నాను''

''నీ ఆదాయం ఎంత వుంటుంది? ప్రాక్టీసు వుందా?''

''నా ఆదాయం యింత అంటూ చెప్పలేను. మానాన్నదీ, నాదీ వేరు కాదు. అయిదేళ్ళ నించీ ప్రాక్టీసు చేస్తున్నా''

''మంగళని నువ్వు చేసుకుంటావా? ఈ ముహూర్తానికే అయిపోవాలి పెళ్ళి!''



## దూతకార్యం

నాకు ఎలా మాట్లాడాలో తెలియలేదు.

"వాళ్ళ అమ్మా, నాన్నని ఒప్పించా లేమో!" ఎవరో అన్నారు.

"వెంటనే చెప్పు. మీ అక్కకి యియ్య దలచుకున్నదంతా [illegible]స్తా — మంగళని మీ వాళ్ళంతా యిష్టపడ్డారు. దాని తప్పువల్ల, యీ పెళ్ళి ఆగిపోవటంలేదు. మళ్ళీ మీ అమ్మ, నాన్న సంప్రదింపులూ, అంటే నే నొప్పుకోను. నువ్వు చేసుకుంటావా? లేదా?" పురుషోత్తంగారి గొంతులో కఠినత్వం పోయి, ఆడపిల్లని కన్న తండ్రి దీనత్వం, ఆతృతా చోటు చేసుకున్నాయి

జాలితో నా గుండె విలవిల లాడింది. తనది కాని తప్పుకు మంగళ ఎందుకు శిక్ష అనుభవించాలి? అయినా ఆమెకు ఏం తక్కువ? సామాన్యమైన అందం, బి. ఏ. డిగ్రీ, వెనక ఆస్తి. మా అన్నదురదృష్టం. నా అదృష్టం ఆమె నాది కావటం.

"నాకేం అభ్యంతరం లేదు" అన్నాను గట్టిగా. సుఖాంతమైన సినిమా చూసిన తృప్తి, చుట్టూ వున్న వారిలో తొంగి చూసింది.

"నాకు ఈ పెళ్ళికి అభ్యంతరం వుంది నాన్నా. నా తప్పు ఏం లేకుండా పెళ్ళి తప్పిపోతే, నేను శిక్ష ఎందుకు అనుభవించాలి? ఎవడో ఒక మగవాడిచేత అదే ముహూర్తానికి నే నెందుకు వధ్యశిలలో పశువులా పసుపు తాడు కట్టించుకోవాలి? జీవితాంతం సహచరుడుగా వుండబోయే భర్తను మనస్ఫూర్తిగా యిష్టపడి చేసుకొనే హక్కు నాకు లేదా? నాకేం తక్కువని? అందమా, చదువా, గుణమా? వెనక మీరిచ్చే ఆర్థిక బలమా?— నా అదృష్టంకొద్దీ వీరి అన్న చేత తాళి కట్టించుకుని, జీవితాంతం ఉంపుడుగత్తెలా వుండే దురదృష్టం తప్పింది. ముందుగానే చెప్పి, మనకి సహాయం చేసిన మోహన్‌గారికి నా కృతజ్ఞతలు. నాకు తగిన భర్త లభించేదాకా నేను వేచి వుంటాను. ఈ హడావిడి పెళ్ళి మాత్రం నేను ఛస్తే చేసుకోను" సింధూర రంగుచీర కట్టిన కాళీ మాతలా మంగళ ఒక్కసారి మెరిసి, ఆ గదిలోంచి నిష్క్రమించింది.

# హైదరాబాద్ నోట్‌బుక్

**రాష్ట్ర ఇ. కాం. అధ్యక్షుడు శ్రీ అజీజ్ :**

ఇందిరాకాంగ్రెస్ రాష్ట్రశాఖ అధ్యక్షుడుగా విధాన సభ సభ్యుడు శ్రీ ఎం. ఎ. అజీజ్‌ను శ్రీమతి ఇందిర గాంధి నియమించారు. ఇంతవరకు అధ్యక్షుడుగా వున్న డాక్టర్ చెన్నారెడ్డి ముఖ్యమంత్రి పదవి స్వీకరించిన పిదప ఈ పదవికి రాజీనామా ఇచ్చారు. కనుక ఇంతవరకు ఖాళీగా వుంది. శ్రీ అజీజ్ వయస్సు 45 సంవత్సరాలు. పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరుతాలూకా పెనకడ వోలులో జన్మించారు.

**మంత్రి శ్రీ వెంకటరామ్ సూచన :**

విద్యాశాఖామంత్రి శ్రీ భవనం వెంకటరామ్ జనవరి 18వ తేదీన విట్ఠల్‌వాడీలో చిల్డ్రన్స్ ఆర్ట్స్ అకాడెమీ అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా ఏర్పాటు చేసిన భారతీయ బాలల చిత్రకళా ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేస్తూ, ఏజాతి భవిష్యత్తయినా బాలల తీరుపైనే ఆధారపడి వుంటుందని కనుక బాలల అభివృద్ధికి తగిన వాతావరణం కల్పించడం అవసరమని సూచించారు. అధ్యక్షత వహించిన విద్యాశాఖా కార్యదర్శి శ్రీ బి. ప్రతాపరెడ్డి ప్రసంగిస్తూ, ఈ సంస్థ జాతీయ స్థాయిని సంపాదించుకోవాలని సలహా యిచ్చారు. పిదప మంత్రి శ్రీ వెంకటరామ్ 13 సంవత్సరాలుగా జాతీయ స్థాయి పోటీలలో బహుమతులు గెలుచుకున్న బాలల చిత్రాల ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు. సంస్థ కార్యదర్శిని శ్రీమతి సాంబశివరావ్‌బాబ్జి సంస్థ కార్యక్రమాలను వివరించారు.

**విశ్వసాహితి బహుమతి ప్రదానం :**

నిరుడు విశ్వసాహితి నిర్వహించిన కథానిక, నవల పోటీలలో గెలుపొందిన వారికి ఇటీవల హైదరాబాద్ వై. ఎం. సి. ఎ లో బహుమతులను ప్రముఖ సినీ నిర్మాత శ్రీ యు. విశ్వేశ్వరరావు పంచిపెట్టారు. నవలా రచనలో డాక్టర్ చంద్రిక, శ్రీమతి జంధ్యాల సుబ్బలక్ష్మి ప్రథమ బహుమతి అందుకున్నారు. కథల పోటీలో శ్రీ సార్వపువురావు (బెంగుళూరు)కు, శ్రీ సింహప్రసాద్‌కు ప్రథమబహుమతి లభించింది. విశ్వసాహితి అధ్యక్షులు, మాజీమంత్రి డాక్టర్ దేవేందరావు రచయితలకు నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలిపారు. ఆంధ్రా బ్యాంకు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరు శ్రీ కె. వి భాస్కరరావు ఆధునిక సాహిత్యం— యువరచయితలు — అనే అంశంపై ప్రసంగించారు. ప్రారంభంలో శ్రీ కొత్తపల్లి సుబ్రహ్మణ్యం స్వాగతం చెప్పారు. శ్రీ అక్కిరాజు జనార్ధనరావు కృతజ్ఞతలతో సభ సమాప్తమయింది.

**సమాచార భారతి హైదరాబాద్ శాఖ :**

ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి బహుభాషా వార్తాసంస్థ 'సమాచారభారతి' హైదరాబాద్ శాఖకు బషీర్‌బాగ్‌లో జనవరి 21న ప్రారంభోత్సవం జరుపుతూ, తెలుగు టెలిప్రింటర్ల తయారీకి హిందూస్థాన్ టెలిప్రింటర్ల సంస్థకు ప్రభుత్వం నుంచి ఎటువంటి సహాయమయినా అందగలదని అన్నారు. తెలుగును రోమన్ లిపిలోగాని, దేవనాగరిలో గాని వ్రాయడాన్ని ఆయన వ్యతిరేకిస్తూ, తెలుగు లిపి సుందరమయిందని, దాని స్థానంలో వంకర టింకర అక్షరాలు ప్రవేశ పెట్టడం తనకు నచ్చదని ఆయన అన్నారు. ప్రాంతీయభాషలలో వార్తల సరఫరా ద్వారా భాషా జర్నలిజాన్ని అభివృద్ధిపరచడం తమ లక్ష్యమని 'సమాచార భారతి' ప్రధానాధ్యక్షుడు శ్రీ ధర్మవీర్‌గాంధి అన్నారు. సమాచార భారతి హైదరాబాద్ శాఖ మేనేజర్ శ్రీ ఆదిరాజు వెంకటేశ్వరరావు ప్రారంభంలో స్వాగతం పలికారు. ప్రారంభోత్సవానికి సంస్థ చైర్మన్ శ్రీ ఎల్. ఎం. సింఘ్వి అధ్యక్షత వహించారు.

**హర్కారే రచనపై సదస్సుకు సూచన :**

అనేక శాస్త్ర పారీణులు, మహా రచయిత, బహుభాషా వేత్త శ్రీ గుండేరావ్ హర్కారేకు నివాళులు అర్పించడానికి జనవరి 22వ తేది హిందీమహా విద్యాలయంలో జరిగిన సంతాపసభలో అధ్యక్షత వహించిన డాక్టర్ బిరుదురాజురామరాజు, డాక్టర్ పి జి లాల్యే, డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు, శ్రీ కె. ఆర్ సుబ్రహ్మణ్యం, శ్రీ రామాచార్య ఘనపాటి, శ్రీ మరింగంటి సింగరాచార్యులు, శ్రీ హరిహరనాథ్, తిరుమల రామచంద్ర, శ్రీ రవ్వా శ్రీహరి, హర్కారే పాండిత్య, రచనా ప్రతిభావిశేషాలను గురించి ప్రశంసించారు. శ్రీ హర్కారే సిద్ధపరచిన వ్యాకరణ రూపసిద్ధి యంత్రాన్ని ఆధునిక పద్ధతులపై తీర్చిదిద్దాలని, ఆయన రచించిన ప్రత్యయకోశం, వివిధ రకాల గ్రంథాలకు చేసిన సంస్కృతానువాదాలు ప్రచురించాలని, ఆయన కృషిని జనానికి తెలియడానికి ఆయన రచనలపై సదస్సును ఏర్పాటు చేయాలని సూచించారు. ఆయన వల్ల నేటివారు నేర్చుకోవలసింది వినయం, దైన్యంలేని జీవితం, జిజ్ఞాస అనే గుణాలని వక్తలు తెలిపారు. ఆయన గ్రంథాల ప్రచురణకు ప్రభుత్వ, సాహిత్య అకాడెమీ, తిరుమలతిరుపతి దేవస్థానం మున్నగు సంస్థల నుంచి ఆర్థిక సహాయం కోరాలని సూచించారు.

**[illegible] :**

"శ్రీ పి బి శ్రీనివాస్ సంగీత రజతోత్సవంలో ముఖ్యఅతిథి అయిన మంత్రిని అధ్యక్షుడు ఎర్ర రామరెడ్డి సినిమాస్టార్‌లాగా వున్నారు, సినిమాలో చేరివుంటే బాగుండేది— అన్నారు కదా, మీ అభిప్రాయమేమిటి?" అనడిగారు ఒక శ్రోత అది ఆయన అభిప్రాయం, నా ప్రసక్తి ఏముంది దీంట్లో —అని ఆలోచిస్తుండగా, మరొక శ్రోత అన్నారు : "అందమైన వాళ్ళంతా సినిమాలోను, మహామేధావులంతా మంత్రివర్గంలోను వుంటే ఇంకేముంది బాబూ!" అన్నారు.

—తిరుమల రామచంద్ర

ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ అబ్రహాం కృష్ణాజిల్లా పర్యటన సందర్భంగా మచిలీపట్నంలో ఏర్పాటు చేసిన సాంస్కృతిక కార్యక్రమాన్ని చూసి, మిమిక్రీ కళాకారుడు శ్రీ సిల్వర్‌స్టార్‌కు మెమెంటో యిస్తున్న దృశ్యం. శ్రీ సిల్వర్‌స్టార్ భారతదేశం అంతా పర్యటించి మిమిక్రీ ప్రదర్శనలు చేశారు.



ఫిబ్రవరి

# భారతిలో

* క్లాసిక్-రొమాంటిక్
* సంప్రదాయం ప్రగతి వ్యతిరేకమా
* మార్క్స్ వెబర్
* తెలుగువారి వింత పేర్లు

ఇంకా ఇతర రచనలు

వనితలకు మనవి

కొత్తరకం వంటలు
క్లుప్తంగా వ్రాసి పంపితే
త్వరగా పరిశీలించ వీలు —సం





ఎడ్వర్టైజింగ్ ఏజన్సీస్ అసోసియేషన్ ఆఫ్ ఇండియాకు 1978 – 79 సంవత్సరానికి అధ్యక్షుడిగా ఏకగ్రీవంగా ఎన్నికైన శ్రీ అహ్మద్ ఇబ్రహీం.

## అవీ-ఇవీ-అన్నీ

## అభినవ వాల్మీకికి కళాభారతి సన్మానం

ప్రముఖ కవి, కవిరత్న, అభినవ వాల్మీకి శ్రీ యామిజాల పద్మనాభస్వామిగారికి మదరాసులోని తెలుగు సాంస్కృతిక సమితి "కళాభారతి" వారు జనవరి 25న ఘన సన్మానం చేశారు. శ్రీ పర్వతనేని బ్రహ్మయ్య అధ్యక్షతన జరిగిన ఈ సభలో డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మ ప్రసంగించారు. శ్రీ బ్రహ్మయ్య పట్టు వస్త్రాలు, దుశ్శాలువ తోనూ, శ్రీ బి.వి.ఎస్.ఎస్. మణి సువర్ణాంగుళీయము తోనూ, శ్రీ పి.బి. సుబ్బారావు రజితమయ శ్రీరామ పట్టాభిషేక పటములతోనూ, శ్రీ జైహింద్ సత్యం సన్మాన పత్రములతోనూ శ్రీ యామిజాల వారిని సత్కరించారు. అనంతరం శ్రీ సి.హెచ్. బాలసుబ్రహ్మణ్యం వేణుగాన కచేరీ జరిగింది. శ్రీ కె.ఎస్.ఆర్. నరసింహారావు వందన సమర్పణ చేశారు. (ఒ. వి.)

### ఏకాంక సంగ్రహం

(కన్నడమూలం : ఆద్యరంగాచార్య. తెలుగుసేత : అయాచితుల హనుమచ్ఛాస్త్రి, సాహిత్యఅకాడెమి) న్యూఢిల్లీ. 276 పేజీలు, వెల రూ. 10.00.

సుప్రసిద్ధ కన్నడరచయిత ఆద్యరంగాచార్య ఏర్చి కూర్చిన 11 ఏకాంకికల సంకలనమిది. శ్రీయుతులు బేంద్రే, కు. వెం. పు, శివరామకారంత, టి. పి. కైలాసం మొదలైన సుప్రసిద్ధ రచయితల నాటికలిందులో వున్నాయి. శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి అనువాదం తెలుగునుడికారానికి దూరమై, విలక్షణ రీతిలో సాగింది. ఇరుగుపొరుగు భాషల్లోని రచనల్ని ఆస్వాదించాలంటే ఇటువంటి సంకలనాల అనువాదం ఎంతో అవసరం. ఆ అనువాదాలు తెలుగుపలుకుబడికి దూరం కాకూడదు.




Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika Press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna.



'ప్రెసిడెంట్ పేరమ్మ'లో నూతన్‌ప్రసాద్, కవిత




ఈ రోజుల్లో తలనొప్పి అంటే
మాటలా!

సాలోఫేన్ ను వాడండి.
అమోఘంగా నొప్పులను నివారించే
విశిష్టమైన మాత్ర.
వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా
నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ
వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా,
తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి, ఫ్లూ జ్వరాలకు
కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.
సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—వీళ్లతరబడి
ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్
లిమిటెడ్ వారి తయారీ-

అమృతాంజన్ లిమిటెడ్‌వారి నమ్మకమైన తయారీ

సాలోఫేన్
అమోఘమగు
నిరపాయకరమైన
నొప్పుల నివారిణి